


# పేద పడుచు

రచన: సీతారాంరాజు.

# పేదపడుచు

[మహోజ్వల సాంఘిక నాటకం]

రచన:

సీతంరాజు వెంకటేశ్వరరావు

ఐదవ కూర్పు

1000 ప్రతులు

ముద్రణ:

వెంకటేశ్వర ప్రింటింగ్ వర్క్సు

పబ్లిషర్సు:

జయశ్రీ బుక్ డిపో - విజయవాడ-1

ప్రొ॥ [illegible]

విజయవాడ-1



[వెల రు 2-50

# పాత్రపరిచయం

**చంద్రం:**

ఆస్తిపరుడు: ఉదాత్త స్వభావంకలవ్యక్తి. కథానాయకుడు, వయస్సు 20 సం||లు

**సూర్యం:**

చంద్రం ప్రాణమిత్రుడు: అమాయకుడు తనమాటనెగ్గలేదని అధోగతిపాలైన అవివేకి. 25 సం||లు

**మూర్తి:**

దేశద్రోహి కరుణలేని కఠినుడు: గౌరిని ప్రేమించి ఫలితం పొందక నిరాశ చెందిన దుష్టబుద్ధి వయస్సు 30 సం||లు

**తాత.**

ఇరుగు పొరుగున నివసించేవృద్ధుడు: డబ్బుకోసం ఏం చేయటానికైనా వెరవని నీచుడు. వయస్సు 60 సం||లు

**బసవయ్య:**

నిరుపేదజీవి: గౌరితండ్రి చల్లనిమనస్సుకలవాడు వయస్సు 40

**నాగన్న:**

మూర్తి కుడిభుజం: పేదవాళ్ళ సుఖాన్నిచూసి ఓర్వలేని వక్రబుద్ధి వయస్సు 30 సం||లు కొద్దిగా కుంటుతాడు.

**గౌరి:**

పేదరాలై దాసీగా జీవిస్తూ దారితప్పిదగాపడి, నిరపరాధైతననిర్దోషిత్వాన్నిరూపించి ఫలితంపొందినప్రణయజీవివయస్సు 15సం||

**సుగుణమ్మ.**

చంద్రంతల్లి: పేదవాళ్ళంటేదయవయస్సు 50||లుజాట్టుతీయని విధవ ఇంకా సబిన్‌స్పెక్టర్, ముగ్గురు పోలీసులు; ముష్టివాడు సమయానుకూలంగా వస్తారు.

# పెద పడుచు

## 1 వ రంగం

[స్థలం చంద్రభవనంలో కచేరుసావిడి సమయం ఉ. 8గం॥ ప్రాంతము వొకప్రక్క టేబిలుదానిమీద కొన్ని పుస్తకాలు వుంటాయి. దానికొంతదూరంలో వొకసోఫా, దానికిఎదురు గుండా నిలువుటద్దం అమర్చబడి వుంటుంది. గోడకు వొక ప్రక్క దేశనాయకులు, మరోప్రక్క దేవుళ్ళఫోటోలు అమర్చ బడివుంటాయి. గౌరి బియ్యం చెరుగుతూ వుంటుంది. తెర మెల్లిగా ఎత్తబడుతుంది. గోడగడియారం ఎనిమిదిగంటలు కొడుతుంది]

తాత – (ప్రవేశించి) గౌరీ! సుగుణమ్మ లేదూ!

గౌరి – ఉన్నారండి పిలుస్తాను (అని లోపలికి వెళుతుంది)

తాత – (ప్రవేశించి)

సుగుణ – రా బాబాయ్ (వస్తుంది)

తాత – (అక్కడున్న సోఫాలో కూర్చుంటాడు)

సుగు – తెల్లవారేసరికి వచ్చావేమిటి బాబాయ్ !

తాత – ఏముందీ! నీవల్ల వొక సహాయం కావల్సివచ్చాను.

సుగు – ఏమిటా సహాయం !

తాత – మీ పిన్ని చావుబ్రతుకులమీదుంది. పదిరూపాయ లుంటే చేబదు లిప్పిస్తావేమోనని...

సుగు – అలాగే బాబాయ్. చిల్లర కాగితాల్లేవు. పెద్దకాగితం యిస్తాను. మార్చి నీకుకావలసిందితీసుకొని మిగిలిందిపంపు

తాత - అలాగేనమ్మాయ్. (పుగాకుతీసిచుట్టచుడుతూవుంటాడు) ...(సుగుణమ్మ లోపలకు వెళ్తుంది. ఆదార్నే గౌరి ప్రవేశించి టేబుల్‌మీద కాగితాలు మొ॥నవి సర్దుతూ వుంటుంది. తాతచుట్టనోట్లో పెట్టుకొని) గౌరి, మీఅమ్మ గార్ని అడిగి అగ్గిపెట్టె అందుకో. (గౌరి నిష్క్రమి స్తుంది ఆదార్నే సుగుణమ్మ ప్రవేశిస్తుంది)

సుగు - ఇదిగో బాబాయ్. వందరూపాయల కాగితం అంది స్తుంది)

తాత - (అందుకొంటూ) చిల్లలకాగితాలు వెంటనే పంపు తానూ-

గౌరి - (అగ్గిపెట్టె తెచ్చి తాతకి అందిస్తుంది)

తాత - (చుట్ట ముట్టిస్తూ వుంటాడు)

సుగు - ఆనక పిన్నిని చూట్టానికి రావాలనుకుంటున్నాను. అప్పుడివ్వొచ్చును గాని యింతతొందరలేదు నీదగ్గరే వుంచు.

తాత - (అగ్గిపెట్టె గౌరికి అందిస్తూ) అలాగే లేమ్మా (వెళ్ళి పోయి) పోనీ యిప్పుడు నాతో రారాదూ వెంటనే వచ్చేద్దువుగాని.

సుగు - రావటానికి వేరేకారణం ఏంలేదుగాని మాచంద్రం వస్తున్నాడు.

తాత - చంద్రమా!

సుగు - అవును ..

తాత - ఎప్పుడు!

సుగు – ఈ బండికే వస్తాట్ట. తీరావాడు వచ్చేసరికి ఇంటిదగ్గర లేకుండా ఎందుకాని.

తాత – అవునవును... లేకుండా వుంటే ఏలాగు! ... సరేలే అమ్మాయ్... వస్తానూ (నిష్క్రమిస్తాడు)

సుగు – మంచిది బాబాయ్. (గౌరితో) గౌరీ, యీ బియ్యం కాస్త చెరిగి బాగుచెయ్. (లోపలకు వెళ్తూవుంటుంది)

గౌరి – ఎవరండి అమ్మగారూ, మనింటికొచ్చే చుట్టాలు!

సుగు – ఎవరేమిటి పిచ్చిబాంద? మా చెంద్రం...

గౌరి – అంటే?

సుగు – మా అబ్బాయి... చూడు. ఆ బియ్యంచెరిగి గదంతా శుభ్రంగా సర్దమ్మా (లోపలికి వెల్తుంది)

గౌరి – (ఉత్సాహంగా పనులుచేస్తూ పాడుతూ వుంటుంది.)

వస్తారూ వస్తారూ నేడే యజమానొస్తారు ॥వస్తా॥
కిక్ కిక్ కిక్ మని గొంద్రు
పెట్టుచూవచ్చే బండిలో వస్తారు
వింతవింతలూ చెప్తారు
చెప్పిన వన్నీ వింటాము ॥వస్తా
రకరకాల వస్తువులెన్నో
అమ్మ ముందుగ యిస్తారు
తెచ్చినవన్నీ నాకిస్తారు
యిచ్చినవన్నీ సర్దాలి
వెంట వెంటనే సర్దాలి
ఎక్కడివక్కడ సర్దాలి వస్తా

(కూలీ పెట్టె, బెడ్డింగులు తెచ్చి లోపల పెడ్తాడు గౌరి అదిమాని పాట ఆపి పరుగున లోపలకు పోతుంది. వెంట * ఆ దార్నే సుగుణమ్మ, వెనుక గౌరి ప్రవేశిస్తారు. బయటినుంచి చంద్రం ప్రవేశించి సుగుణమ్మ కాళ్ళ కి నమస్కరిస్తాడు)

సుగు – [చంద్రాన్ని లేవనెత్తుతూ] హారతితీసుకురా [చంద్రంతో] కులాసాగ వున్నావా బాబూ?

గౌరి – [లోపలకు వెల్తుంది]

కూలి – డబ్బులు బాబయ్యా'

చం – [పర్సులోనుంచి డబ్బులుతీసి కూలికిఅందిస్తూవుంటాడు] గౌరి హారతిపళ్లెంతో ప్రవేశిస్తుంది. గౌరీ చంద్రాలు వొకరినొకరు రెప్పవాల్చకుండా చూస్తూవుంటారు. హారతిపళ్లెం సుగుణమ్మకి అందివ్వబోయిపరధ్యాన్నంగా అది క్రిందపడేస్తుంది గౌరి. అశుభానికి తలవంచుకొని విచారిస్తుంది.)

సుగు – పోనీలేవే విచారించకు అలా జరగవలసివుంది. అంతమాత్రానికే మనం విచారించకూడదు.

చంద్రం–[నవ్వి]పూర్వాచారాలుమనఇంట్లో ఇంకామానలేదే! చాలుగాని,తొందరగాస్నానంచేయాలి అప్లనేదో చూడండి.

సుగు – నీళ్ళు క్రింద నిప్పేళావా గౌరీ.

గౌరి – వేశానండి.

సుగు – పరవాలేదు లే విచారించకు నీళ్లుతొందరగాకాయిపో. [చంద్రం లోపలకు వెల్తున్న గౌరినిచూస్తూవుంటాడు]

సుగు - చంద్రం!

చం - [ఉలిక్కిపడి] అఅఅ... ఏమిటే! సమీపానున్న పత్రిక చూస్తూం వుంటాడు.

సుగు - మామయ్య పిల్లలూ కలాసాగ వున్నార్రా?

చం - వున్నారమ్మా.

సుగు - లీలేమంటోంది?

చం - అత్తయ్యనిరమ్మంటోంది. [నవ్వుతాడు]

సుగు - లీలని నీకిచ్చి పెండ్లి చేయాలని మామయ్యకిఎంతో సరదాగా వుంది. ప్రతివుత్తరంలోనూ, లీలా చంద్రంలు కలాసాగా నేచదువుకుంటున్నారని ఏవేవో వ్రాసేవాడు

చం - [అమాయకంగా] అలాగా!

సుగు - అవునాయినా, మేనరికం కావాలంటేకుదురుతుందా? అదకూడా నువ్వంటే పంచప్రాణాలూ విడుస్తుంది.

చం - [ఆక్షేపణగా] అవునవును అందుకే అదంటే నాకు భలే ప్రేమ.

సుగు - నవ్వుకుంటూ] ఉండదూ నాయనా, వుంటుంది. మేన అత్త మేనమామ బిడ్డలైనందున ఆపాటీవుండదూ.

గౌరి - [ప్రవేశించి] నీళ్లు కాగిపోతున్నాయండి అమ్మగారు.

సుగు - నీళ్ళుతోడు. వస్తున్నాడు.

చం - నిష్క్రమిస్తున్న గౌరినిచూస్తూ) ఎవరే యీఅమ్మాయ్

సుగు - పనిమనిషి. యింట్లో పిల్లకంటే ఎక్కువగాతిర్గుతోంది చాలమంచి పిల్ల.

చం అలాగే కనిపిస్తోంది.

(బసవయ్య ప్రవేశిస్తాడు)

బస - మొహాన చేయి అడ్డుపెట్టుకు చూస్తూ) సుగుణమ్మ తల్లీ!

సుగు - ఆ! రా బసవయ్యా... కూర్చో.

చం- యెవరే యీ బసవయ్య!

సుగు - ఆ పిల్లతండ్రి.

చం - అలాగా!

బస - కూర్చుని) ఎవరమ్మా మాటాడేది ?

చం - అదేమిటే అలా అడుగుతాడు ?

బస - చూపు సరిగా ఆనదు బాబూ— అందుకడిగాను.

సుగు - తప్పులేదులే బసవయ్యా. మా అబ్బాయి చెంద్రం.

బస కలకత్తాలో చదువుతున్నారని చెప్పారూ, ఆయనా?

చం - నవ్వి) అవును ఆయనే యీాయన

బస - కులాసాగా వుంటున్నారా అయ్యగారూ?

చం - ఆ!

సుగు - పనిమీాదొచ్చావేం బసవయ్యా— గౌరి కావాలా!

బస - వద్దు తల్లీ వద్దు. దాన్ని పని చేశుకోనీయండి... యీ దార్నిపోతూ పోతూ, చూచిపో మని వచ్చాను.

గౌరి - నీళ్ళతోడావండి అంటూ (ప్రవేస్తోంది)

(చంద్రం గౌరినిచూస్తూనే నిర్విణ్ణుడౌతాడు)

గౌరి— (బసవయ్యని సమీాపించి) ఏంనాన్నా ఇలావచ్చావు?

బస — ఏమీాలేదు తల్లీ. యింటికిపోతూఅమ్మనిచూచిపోదా మనివచ్చా. యీావూరొచ్చి పదినెల్లయింది. అప్పటి

నుంచి యిప్పటివరకూ భగవంతుని దయంటూ అమ్మ నీడనే బ్రతుకుతున్నాం... ఆ తల్లికూడా అమ్మకంటె ఎక్కువగా అభిమానం చూపి ఆదరిస్తోంది. ఆ తల్లిని చూడకుండా వుండటానికి మనస్సుండపట్టక వచ్చాను.

సుగు - వస్తే వచ్చావులే బసవయ్యా-పరాయివాళ్ళయినా యింట్లోవాళ్ళకంటే ఎక్కువగా తిరుగుతున్నారు అంతే చాలు. గౌరికూడా దానిపసదిలక్షణంగా చేసుకుంటోంది

బస - అదే ఆనందం తల్లీ! వాళ్ళమ్మపోతూపోతూ యీపసి కూనని నా చేతులలో పెట్టిపోయింది. యేదో ఇంతవరకు పెంచి పెద్దదాన్ని చేశాను... అదికూడ వాళ్ళమ్మ గౌరవానికి భంగం రాకుండా కాపాడుకుంటోంది. [కన్నీరుతుడుచుకొంటూ] నా బొందిలో వూపిరుండగానే దానికి నాల్గు అక్షింతలగింజలకా వేయించానంటే నా కదే చాలు.

సుగు - కాదూమరి, ఆడపిల్లల్నికన్నతండ్రికుండేకోర్కెఅదో క్కటేగా. అయితే మేనరికం...

బస - ఉండటానికివుంది. వుండిప్రయోజనం? వాడంతదుష్టుడు ప్రపంచంలో ఎక్కడా కనుపించడు. ఖూనీకోరుజూదరి త్రాగుబోతు, వ్యభిచారి—వకటావుండవలసిన అవలక్షణాలన్నీ వాడిలో వున్నాయి.

గౌరి - (కంటతడిపెట్టి) మాస్థితియీరోజున యిలావుండటానికి కారణం వాడేకదూ!

సుగు - ఆశ్చర్యంగా) ఏం!
గౌరి - అదంతా వొక పెద్దకథ.
సుగు - ఫరవాలేదులే చెప్పు.
బస - వాడుచేసిన తుంటరిపన్లు చెప్పినా తరగవు... గౌరిని తను పెండ్లిచేసుకోవాలని చాలా కాలంనుంచి పట్టు పట్టాడు. ఆ పట్టుదల నాకుపరమనీచంగా కనుపించింది.
సుగు - మేనమామకేగా పెళ్ళి చేయకపోయావు!
బస - అంతమాత్రాన తడిగుడ్డతో గొంతుకోయమంటావా తల్లీ! వాడు రెండుమూడుఖూనీలు చేయించాడు... తన అఖర్లకి డబ్బు అవసరమని అందుమూలకంగా ఎన్నో దారుణమైన పనులు చేశాడు.
గౌరి - నన్నిచ్చి పెండ్లిచేయటం మా తాతకి యిష్టంలేకపోతే హటాత్తుగా ఆయన్ని హత్యచేయించాడు.
సుగు - ఆశ్చర్యంగా) తండ్రినే!
బస - వాడితండ్రి కాదమ్మా! నా తండ్రిని... అంతటితో వాడి ఆవేదన చల్లారక మా ఆస్తి అంతనీ అన్యాయంగా అపహరించాడు.
సుగు - యిలాంటివాణ్ని చూస్తూ గవర్నమెంటెలా సహించి వూరుకుంది!
గౌరి - లేదు, ఊరుకోలేదు... వాణ్ని పట్టుకోటానికి ప్రయత్నాలు చేస్తూనే వున్నారు.
బస - కాని లాభం——వాడు దొరకడు. కొంపతీసి దొరికితే వాళ్ళకో పాతిక ముప్పయ్యో చదివించి వాళ్ళ బారి నుండి తప్పించుకుంటాడు.

సుగు - పోనీ నీవెందుకు పట్టించ లేవు?

బస - నేనేకాదు. ప్రాణాలమీద ఆశంటూ వున్నవాళ్లెవరు పట్టించలేరు. వాడంటె వూరు వూరంతా హడలెత్తి పోతుంది.

సుగు - ఏ వూళ్ళో వున్నాడు?

గౌరి - ప్రస్తుతం యిక్కడే

సుగు - తెల్లబోయి చూస్తూ) ఈ వూళ్ళోనా?... అంతటి మొనగాడెవరు నాయనా?

గౌరి - మూర్తి అని మీరు వినేవుంటారు.

సుగు - మూర్తి నీ మేనమామా!... చాలు యింక వినక్కర లేదు.

గౌరి - విచారిస్తూ) మా ప్రాణాలకీ పెనుభూతంలా సంచరిస్తు న్నాడు.

సుగు - విచారించకే పిచ్చిపిల్లా—నీకు వచ్చిన భయమేమీ లేదు మిమ్మల్ని కాపాడే బాధ్యత మాది.

బస - చల్లని తల్లి. వెయ్యేళ్లు వర్ధిల్లమ్మా.

సుగు - వచ్చే శ్రావణమాసంలో చెంద్రం పెండ్లి చేస్తాం. అప్పుడె గౌరి పెండ్లికూడా చేస్తే తీరిపోతుంది.

బస - ఎలా కుదురుతుందమ్మా? కానీకి కొరగాని కాకికూడా కట్నం లేందే యిష్టపడని యీ రోజులలో ఎలాసాధ్య పడటం?

సుగు - ఇదంతా మన అలోచనేకాని నారోసినవాడు నీరో యడా! వాడే తెస్తాడు.

బస - అంతేలేమ్మా అఖరికా వేదాంతమే గుర్తొస్తుంది... అయినా అన్నిటికి మీరేవున్నారు దానికి తల్లీమీరే తండ్రీమీరే.

సుగు - అలాగేలే!

బస - వెళ్ళొస్తానమ్మా అబ్బాయిగారితో చెప్పండి, గౌరీ! యిలారామ్మా, (దగ్గరకుతీసుకొని బుజ్జగిస్తూ) అమ్మ చెప్పిన పనులన్నీ ఆలస్యంచేయకుండా చేస్తూవుండు తల్లీ!... వస్తా... (బయటకు వెళ్తాడు)

సుగు - గౌరి యీ కాగితాలవీ సరీగా సర్దమ్మా, (లోపలకు వెళ్తుంది. గౌరి కాగితాలూ మొదలగునవి సర్దుతూ వుంటుంది... చంద్రం ప్రవేశించి గౌరిని సమీపిస్తాడు)

చం - అటూ ఇటూ చూస్తూ) హారతిపళ్ళెం పడిపోయిందని.

గౌరి - సిగ్గుతో [ప్రక్కకుతప్పుకొని] ఎబ్బె! లేదండి.

చం - ఆఁ అయితే నీపేరు?

గౌరి - తలవంచుకొని] గౌరి ?

చం - చాలా బాగుంది అరె. సిగ్గుపడ్తావేం? ఎవర్నిచూచి?

గౌరి - మాట్లాడదు]

చం - ఏదీ, ఒకసారి తలెత్తు

గౌరి - మాట్లాడదు]

చం - యిదేనా యజమాని మాటవినటం?

గౌరి - నెమ్మదిగా తలెత్తుతుంది]

చం - ఆ అది! యిటుచూడు.

గౌరి - చంద్రాన్ని చూస్తుంది]

చం - చూడు, కలకత్తానుంచి తెచ్చిన వింత వస్తువులన్నీ చూచావా?
గౌరి - చూపించారండీ
చం - యెవరు?
గౌరి - అమ్మగారు
చం - యెలాగున్నాయి?
గౌరి - బాగున్నాయండి
చం - వాటిల్లో ఏదన్నా కావాలా?
గౌరి - నా కొద్దండి సిగ్గుపడుతుంది]
చం - అదిగో మళ్ళీ సిగ్గుపడుతున్నావు
[బయటనుంచి సూర్యం "చంద్ర చంద్ర" అంటూపిలుస్తాడు]
చం - ఆ! రారా సూర్యం [గౌరి నిష్క్రమిస్తుంది]
సూర్యం - [తొందరగా ప్రవేశిస్తూ] అరెరెరెరె అదేమిట్రా అంత చిక్కిపోయావ్
చం - అంతే
సూర్యం - పూర్తిగా చిక్కిపోయా వేమిటాని
చం - అనుమానంగా వుందా?
సూర్యం - అవమానంగాకూడా వుంది ... ఎందుకనంటావు?
చం - తిండితిప్పలూ సరిగా లేక పోతే...
సూర్యం - అదేమిట్రా, మీ మామయ్యున్నాడుగా
చం - వుండటానికి వున్నాడు మనం వుండటంగూడాఅక్కడే
సూర్యం - మరింకేం !
చం - మీాలున్నమాత్రం హోటల్లో

సూ - (ఆశ్చర్యంగా) ఆరిఫూలా! మనవాళ్ళదగ్గరున్న జబ్బే యిది. మెతుకుపోతే బ్రతుకుపోతుందని చస్తారు. వెధవ మొహాలూ వీళ్ళూను (విసుగ్గా) ఛా ఛా ఛా.

సుగు - ఏమిటి నాయనా అంత విసుగ్గావున్నావు ?

సూ - (మాట తడపడుతూ) అహాహ కాదుపిన్నీ మా ఇంటి ప్రక్క యిందుమతమ్మ లేదూ!

సుగు - ఆ! వుంది

సూ - వట్టిరాలుగాయి ముండలే! మాటలసందర్భంలో దాని మాటో క్లైను ఏదో చెప్పుకుంటున్నా ... సరేకాని పిన్నీ ఈవేళ మీ ఇంటిదగ్గరే మన భోజనంకూడా.

సుగు - అలాగేలే నాయనా.

సూ - ఎందుకంటున్నానంటే మనవాడిసరసన తిని చాలా రోజులైందికాదూ ... (నవ్వి) అందుకని.

సుగు - దానికేం రా నాయనా.

సూ - సరేలే పిన్నీ! ఇన్నిసార్లు చెప్పాలా అలాగేవస్తాను. హిహిహిహి, అరేయ్ చంద్రం! నిన్ను చూసేసరికి వెధవప్రేమ పొంగిపోయింది. (అందరూ నవ్వుతారు, సుగుణమ్మ లోపలకెడుతుంది. గౌరిప్రవేశించి ఒక మూల ఏదో సర్దుతూవుంటుంది. చంద్రం ఆమెను చూస్తూనే సూర్యంతో మాట్లాడతాడు) ఇంకా నయం వాళ్ళ తమ్ముణ్ని తిడ్తున్నట్లు మీ అమ్మ వినలేదు.

చం - విన్నా యిబ్బంది లేదులే!

సూ - ఏమో ఏంపాడో-నా గుండెలుమాత్రం రైలింజను క్రింద చక్రాల్లాగా కొట్టుకుంటున్నాయి. (చంద్రాన్ని అమాయకంగా పరిశీలిస్తూ) ఈ జబ్బు కలకత్తాలోనే అంటిందా?

చం — (ఆశ్చర్యంగా) ఏమిటా జబ్బు!

సూ - అదే మీా చూపుడు కళ్ళవాపి.

(యిద్దరూ నవ్వుతారు)

సూ - వీపు చదును కాకుండా కాలంగడుపు.

చం — వోరేయ్ సూర్యం! హద్దుమీారుతున్నావురా.

సూ - ఆనేగా చెప్తున్నాను. (గౌరి నిష్క్రమిస్తుంది)

చం - ఏడ్చావులే నోరుముయ్యి

సూ - పైగా నేను నోరుముయ్యాలీ! బాగుంది.

చం - సంతోషించాను కాని, మిత్రులంతా కులాసాగా వున్నారా?

సూ — ఓ, దిగ్విజయంగా వున్నారుసరేగాని మిస్టర్, మాట మార్చటంలో నీఅంత మొనగాడులేడు (అటూ ఇటూ చూసి) ఆ పిల్లెవరని?

చం — పని మనిషి——

సూ — ఎక్కడ?

చం - మనింట్లోనే

సూ - అవునుకదా, నువ్వేమో లక్షాధికారి బిడ్డవి. అష్టాల్ అది పనిమనిషి. మీా యిద్దరికీ నక్కకీ నాగలోకానికీ వున్న డిఫరెన్సుంది. అవునా?

చం — ఊఁ చెప్పు.

సూ — ఇంకేం చెప్పను వృద్దరి. నీ వాలకం, నీ చూపులలాంటి పేదపడుచులమీద ప్రయోగిస్తే ఫలితాన్ని పొందటం చాలా కష్టమని చెపుతున్నాను కాబట్టి...

చం — ఊఁ-చెప్పు. ఆపావేం?

సూ — ముందుచూపులేకుండా, మందమతిగా మంచీచెడ్డా తెల్సుకోకుండా, పరువుతక్కువ పేదపడుమీద ప్రయోగించే నీదృష్టిని, దయతో మార్చుకోమంటాను.

చం — (నవ్వి) యింతేనా?

సూ — అంతకంటే యేమీ లేదు.

చం — విన్నాను వింటున్నాను. దయుంచి యింకెప్పుడూ ఇలాంటిమాటలతో నా మనస్సుని మలినంచేయబోకు

సూ — ఏం?

చం — కాకపోతే నేనేమిటి? ఆ అమ్మాయిని...

సూ — అహ్హాహాహా చెప్పకుండానే తెల్సిపోయిందిలే—అలా జరిగితే సంతోషమే!

చం — మరి

సూ — ఇంకమాట్లాడను.

చం — ఇంకేం! అలా బజారులోకి పోయొద్దాంరా,

సూ — ఎందుకురాను తప్పకుండా వస్తానుపద(లేచిఆలోచించి) మరి భోజనానికి ఆలశ్యం అవుతుందేమో?

చం — తూర్పు తెల్లారలేదు. అప్పుడే భోజనానికి అంతహడా విడా? ఫరవాలేదులే. అంతగా ఆకలైతే కడుపునిండా కాఫీ పోయిస్తాను.

సూ - ఒ. కె. (యిద్దరూ సిగరెట్లు ముట్టిస్తూంటారు) (తెర)

# పే ద ప డు చు

## 2 వ రం గం

[స్థలం బసవయ్య పూరిపాక. సమయం : ఉ॥ ఆరుగంటలు. పాకలో ఒకవైపు దణ్ణెం దానిమీద కొన్ని గుడ్డలూ, మరో వైపు వుట్టి; అందులో రెండు కుండలూ, వేలాడుతూ వుంటాయి, క్రింద కొన్ని కుండలు బోర్లించివుంటాయి. వాటికి సమీపాన బసవయ్య నులకమంచంమీద గొంగళి ముసుగు పెట్టుకుని నిద్రపోతూవుంటాడు. బసవయ్యకి కొంతదూరంలో గౌరి ఈతాకుచాపమీద నిద్రపోతూవుంటుంది. మూలగా కిరసనాయిలుబుడ్డి వెలుగుతూ వుంటుంది తెర నెమ్మదిగా లేస్తుంది. తెరలో జనం మాట్లాడుకుంటున్నట్లు వినబడుతుంది, [నిద్రలేచి అటూ యిటూ చూసి, వెంట వెంటనే తనింటి పన్లు చేసుకొంటూ పాటపాడుతుంది]

తెల్లవారె తెల్లగాను
మేలుకోండమ్మా
యింటిపన్లు ముగించుకూ
కూలికెల్లండి

కష్టపడి కూలి తెచ్చి
కడుపు నింపండి ॥ తెల్ల॥
పేదపడుచులార మీరు
పసందుగ పనులకెళ్ళి
పన్లుచేసి హాయిగాను
యిల్లుచేరండి
వున్నదాన్ని ఆరగించి
తృప్తిపడండి. ॥ తెల్ల॥

బస - (బద్ధకంగా లేచి ఆవలిస్తూ) గౌరీ! తూర్పు తెల్లారేదు, అప్పుడే మొదలుపెట్టావేం తల్లీ నిద్దరపట్టటల్లేదా?

గౌరి - (నవ్వి) అదేమిటినాన్నా! తెల్లారి చాలా పేపయింది.

బస - (అటూ యిటూ చూ :) ఆ! యింకా నేను తెల్లార్లే దనుకుంటున్నాను.

గౌరి - రాత్రి భాగవతం నాటకం చూశాంకాదూ...

బస - భాగవతం బలేపని చేసిందే! యింకా తెల్లారలేదని బద్ధకంగా పడుకుంటున్నాను... యింకా నయం... సరేకాని తొందరగా పుగాకుపెట్టి అందుకో.

గౌరి - (పుగాకుపెట్టి అందిస్తుంది)

బస - (చుట్టచుట్టుకుంటూ) యింకా పనికి పోలేదేం తల్లీ.

గౌరి - పోతున్నాను నాన్నా!

(బసవయ్య చుట్టముట్టిస్తూవుండగా మూర్తి నెమ్మదిగా బయటనుంచి ప్రవేశిస్తాడు.)

గౌరి - (మూర్తినిచూసి నొసళ్ళు చిట్లిస్తుంది)

మూర్తి - బావా! ఈ బావమర్ది సంగతేమాలోచించావు?

బస - ఏమిటి ఆలోచించేది? (పీలుస్తాడు చుట్ట ఆరిపోతుంది)

మూర్తి - అదే!

గౌరి - ఏది?

బస - (తిర్గి అగ్గిపుల్లగీసి చుట్ట ముట్టిస్తాడు)

మూర్తి - మన పెండ్లివిషయం.

బస - నీవు చేసిన ద్రోహం నా హృదయంలో భగభగా మండి పోతోంది. మానమర్యాదలు కలవాడికి మరోమాటతో పనిలేదు ఎప్పుడూ ఏకేమాటమీద నిలబడతాడు.

మూర్తి - ఏమిటామాట?

బస - ఇదివరకే చెప్పాను (లేస్తాడు)

మూర్తి - అదే ఖాయమా!

బస - అవును ముమ్మాటికీ ఖాయం (నిష్క్రమిస్తాడు)

మూర్తి - (గౌరినిచూస్తూ సిగరెట్టుముట్టించి) నువ్వేమంటావే పిల్లా?

గౌరి - (విసుగ్గా) పనికిపోవాలి. దయచేయమంటున్నా (దారి చూపిస్తుంది)

మూర్తి — (నవ్వి) గౌరీ! తల్చుకున్నపని నెరవేరేదాకా మూర్తి పట్టుదల ఎలాంటిదో ఎరుగవుగా!

గౌరి - ఆపట్టుదలే మాకూ పట్టిందని మవ్వూ తెలుసుకున్నావుగా

మూర్తి — (ఈర్ష్యగా) తెలుసును, సాగదని, వృథా ప్రయాస పడి చేతకానికూతలతో కాలయాపనచేయక కార్య క్రమానికి పూనుకోండి. కాదంటే కష్టంకల్గుతుంది,

కష్టానికి నష్టంగా అష్టకష్టాలుపడి అల్లరిపాలవుతావు. దూరమాలోచించుకో.

గౌరి — అయినాసంతోషమే. తల్లిపోగానే నిలోచ్చటానికి నీడ లేకుండా ఆ యింటిని కాస్తా అపహరించావు.

మూర్తి — అదీ నీకోసమే.

గౌరి — నానాఅగచాట్లూపెట్టి మా నాన్న పరువుప్రతిష్టలు పాడుచేసి అయన్ని నలుగురిలోనూ తలెత్తుకోకుండా చేశావు.

మూర్తి — (నవ్వి) అదీ నీకోసమే గౌరీ! నేనేంచేసినా నీకోసమే!

గౌరి — ఇంతేనా? యింతకంటె ఏమన్నా చేస్తావా?

మూర్తి — ఏమన్నా చేస్తాను—ఎందుకా? నీకోసం. నీ ప్రేమ కోసం నీ అందాన్ని చూసి ఆనందిస్తూ తీయని మధుర స్వప్నాలతో ప్రమగ్గిపోతున్నాను. నిగనిగలాడేనీసుందర విగ్రహం నాహృదయంలో మిలమిలా మెరిసిపోతోంది. కావాలని కాళ్ళదగ్గరకువచ్చిన ప్రేమమూర్తిని కాదని కాలతన్నకూడదు. అదిఆడదానిఅప్రయోజకత్వాన్ని తెల్పుతుంది. యిప్పటికైనా నన్ను అర్థంచేసుకొని నన్నాదరించి నా ప్రేమను ఆరగించి (సమీపిస్తూ) గౌరీ!... యీ దాసుణ్ణి కనికరించి ప్రేమభిక్షపెట్టు.

గౌరి — ప్రేమ. వొక నీచునికి పవిత్ర ప్రేమభిక్ష, నువుచేసిన అత్యాచారాలు నీకు ప్రేమభిక్షకుబదులు పటాపంచలు చేస్తాయి. నిన్ను... యిప్పటికైనా పశ్చాత్తాపడి పరువుగా బ్రతకటానికి ప్రయత్నించు

మూర్తి — (పెద్దగా) గౌరీ

గౌరి — ఇంతకంటే నన్నేంచేయలేవు.

మూర్తి — (నవ్వి) యేమిచేయలేను. వికటంగా (నవ్వుతాడు) యేమీ చేయలేను కాదూ?

గౌరి — ఏంచేస్తావు?

మూర్తి — ఏంచేస్తానా? యీ పంచకూడా లేకుండా పాడు చేస్తాను. సంఘంలో సాకులుచెప్పి నిన్నూ, నీ తండ్రిని నామరూపాల్లేకుండా నాశనంచేయిస్తాను దిక్కులేక వీధివీధిని అడుక్కుతిని గతి కల్గచేస్తాను.

గౌరి — నొసటనున్న గీత తప్పించలేవుగా?

మూర్తి — ఈ వేదాంతమే మిమ్మల్ని వీధికి లాగుతోంది. నా మాట విను.

గౌరి — వినను, వినవలసినపని లేదు (దారిచూపిస్తూ) దయఉంచి దారిపట్టండి (పెద్దగా) ఊ! వెళ్ళవేం?

మూర్తి — (నవ్వి) ఆహా! కోపంకూడా నీ ముఖానికి మరింత అందాన్ని ...!

గౌరి — (పెద్దగా) నోర్ముయ్. నీలాంటి సంఘద్రోహి నీచుడు, త్రాగుబోతు, జూదరి—

మూర్తి — పటప్. (చెంపపై కొడ్తాడు) ఆలోచించుకో! మని ద్దరికీ పెండ్లి జరిగితీరాలి. జాగుచేస్తే అపజయం ఆద ర్శమైన ఆసూతౌ తారు జాగ్రత్త (చరచరా వెళతాడు)

గౌరి — (చెంప సవరించుకుంటూ దుర్వ్యసనాలకి ఆలవాలమైన యిలాంటిఘటాలు వున్నమాటలంటే వులిక్కిపడతారు.

పేదవాళ్ళంటే అంత చులకనగా ఎందుకుచూస్తున్నారో తెల్సుకునేవాళ్ళేరి? పేదవాళ్ళైనా పరువుతక్కువగా బ్రతికే భ్రష్టులు? వాళ్ళు మనుష్యులుకారా? వాళ్ళకి రక్తమాంసాల్లేవా? డబ్బుగలవాళ్ళ కోర్కెలు కొనసాగించటానికి పేదవాళ్ళైనా పరికరాలుగా పనికొచ్చేది?... అవును. ధనికుల దౌర్జన్యాలు పేదవాళ్ళమీదికే పరుగెత్తుతాయ్ ... అన్యాయానికి అక్రమానికి, అర్రులుజాచే అప్రయోజకులు వున్నంత కాలం నాలాంటి అబలలు అంధకారంలో అదృశ్యం కావలసిందే? అందాకా వాళ్ళు నిద్రపోరు.

చం - (కూనిరాగంతీస్తూ ప్రవేశించి) గౌరీ?

గౌరి - (కన్నీళ్ళు తుడుచుకుంటూ) రండి — (నులకమంచం చూపించి) కూర్చోండి.

చం (గౌరినిచూస్తూ) పిచ్చిపిల్లా యెందుకల్లావున్నావు?

గౌరి — (లేనిసంతోషంతో) ఏమీ లేదండీ. తలనొప్పిగాఉంది.

చం — అంతమాత్రానికేనా? (కూర్చుంటాడు) మందేదన్నా వాడకపోయావా?

గౌరి — ఫరవా లేదులెండి... ఆ క్షమించండి. పేదవాళ్ళం పరువుగా బ్రతికే తమలాంటి ప్రభువుల్ని ఎలా సత్కరించాలో తెలియటల్లేదు.

చం — ఏం? ఇంతకంటె ఏంకావాలి? రమ్మనిస్వాగతమిచ్చావు కూర్చోటానికి మంచంచూపావు చాలు. భాగ్యవంతులు ఇంతకంటే బండారం చూపిస్తారనుకుంటున్నావా?

గౌరి — మాటవరుసకంటూ రేకాని...

చం — మనస్సులో మరో మాటుందంటావ్ అవునా?—ఊ అప్పుడే గ్రహించావ్?

గౌరి — లేదంటూరా?

చం — లేకపోతే యిక్కడ కెందకొస్తాను? గౌరి! నువ్వు మంచి దానివి. మంచితనంలో నీకు నువే సాక్షి... ఆ అన్నట్లు మర్చాను యీ వేళ పనికి రాలేదేం? తలనొప్పివల్లేనా?

గౌరి — అవును యిప్పటికే చాలా ఆలశ్యమైంది. అమ్మగారు నాకోసం ఎదురుచూస్తూవుంటారు. మాటలసందర్భంలో ఆమాటే మర్చాను.

చం — ఫరవాలేదులే— కూర్చో.

గౌరి — అమ్మగారు ఆగ్రహిస్తారు.

చం — ఆగ్రహాన్ని అనుగ్రహంగా మారుస్తానుగా... గౌరీ! నీతో ఏకాంతంగా మాట్లాడాలని యెంతోకాలం నుంచి యెదురుచూస్తున్నాను. అవకాశంకోసం అహర్నిశలూ ప్రయత్నంచేస్తున్నా.

గౌరి — (ఆశ్చర్యంగా) నాతో—నా? (నెమ్మదిగా) ఏకాంతంగానా?

చం — అవును... అవకాశాన్ని...

గౌరి — (ఆలోచిస్తుంది)

చం — అనుమానిస్తున్నావా?

గౌరి — లేదు చెప్పండి

చం — అయితే కూర్చో.

(గౌరి క్రిందకూర్చుంటుంది)

చం - ఉహూం—ఇక్కడ కూర్చోవాలి. మంచం (చూపిస్తాడు)

గౌరి — తప్పు... తారతమ్యాల్లేకుండా ఆపని చేయటం చాలా తప్పు.

చం — ఎందుకని?

గౌరి — మీకూ మాకూ చాలాదూరంవుంది.

చం - (నవ్వి) ఏది? అర్థగజంకంటె ఎక్కువలేదే! (సమీపించబోతాడు)

గౌరి — (లేచి కొంచెందూరంగా నిల్చుంటుంది)

చం - పరవాలేదులే. రా—

గౌరి — వద్దు. క్షమించండి.

చం — గౌరీ! (భుజంమీద చెయివేస్తాడు)

గౌరి — (చంద్రాన్ని చూసి గాబరాపడ్తూ నెమ్మదిగా) నేనుమీయింట్లో దాసిని.

చం - లేదు. నీ ప్రేమకు నేను దాసుణ్ణి. నిన్నూ, నీ సౌందర్యాన్ని చూస్తూ, అనుక్షణం నాలోనేను ఆనందిస్తూ పొంగిపోతున్నాను. శరీరాలు వేరైనా హృదయాలు రెండూ వొకేహృదయంగా వుండాలనేఆశతో ఎదురుచూస్తున్నాను. నిన్ను ప్రేమించి, పెండ్లిచేసుకొని ఆదర్శంగా బ్రతకాలని అలమటిస్తున్నాను. అదే నాహృదయంలో ఆశాసౌధంగా నిర్మించబడి, నీపవిత్ర ప్రేమను పొందాలని ప్రాకులాడుతోంది.

గౌరి — (గాబరాపడ్తూ) వద్దు యిది మీకు తగనిపని. తింటానికి తిండిలేక పడుంటానికి పంచ లేకతమర్ని నమ్ముకొనితమ

పంచన దాసీదానిగా చేరతాను. దయవుంచి ఈ పేదదాన్ని విడిచి ధనికుల పిల్లని పెండ్లాడి సుఖపడండి.

చం - పిచ్చిదానా! ధనానికి ప్రేమకీ సంబంధం లేదు. యీ రోజులలో ధనికులకంటె పేదవాడే పరువుగా బ్రతుకుతున్నాడు. పేదవాళ్ళు వున్నదానితో తృప్తిపడి సుఖముగా జీవనంచేస్తారు. ధనికుడు వున్నదానికి పదిరెట్లు కలవాలని వుబలాటపడి, పాపాన్ని ఆరాదించి పరమ నీచులుగా బయటపడతారు. కాయకష్టంచేసి జీవించే కన్యకంటే కాలుమీద కాలు వేసుకుని కులుకుతూ కూర్చునే కన్యని ప్రేమించి పెండ్లాడితే సుఖంలేదు. నామాట నమ్ము. ఏనాడు నిన్ను చూశానో ఆనాటి నుంచే నా హృదయాన్ని నీకు, నీ ప్రేమకి అంకితం చేశాను. మరువరాని మధుర స్వప్నాలతో శరీరాన్నె [illegible] మరచి, నా హృదయకిరీటంగ నిన్ను ఆరాధిస్తూ అవకాశంకోసం ఎదురుచూస్తూ పొంగిపోతున్నాను. నిన్నే ప్రేమించి నీ ప్రేమభిక్షకోసం ప్రాకులాడుతున్నా! గౌరీ నా హృదయ సామ్రాజ్యానికి మహారాణివి.

గౌరి — పేదపడుచుకోసం ప్రయాసపడి ప్రేమించి పెండ్లిచేసుకుంటే మీ పరువుప్రతిష్టలకే భంగంకల్గుతుంది. సంఘములో విలువతగ్గి సాటివాళ్ళలో నవ్వులపాలవుతారు.

చం — అయినా సంతోషమే! ప్రేమ పేదరికాన్ని చూడదు నీకోసం నీ ప్రేమకోసం [illegible]

వున్నాను. నన్ను నిర్బంధించకండి. (చెయ్యి విడుల్చుకొని) అందనిఆదర్శంకోసం ఆశపడి, అపజయం పొందటానికి నామనస్సు అంగీకరించటల్లేదు. నామాటవినండి

చం – (నిరుత్సాహంగా) నా ఆశ నిరాశ కావలసిందేనా? నిన్ను ప్రేమించి ఫలితంపొందలేనిఅభాగ్యుణ్ణి కావాలా!

గౌరి – (పొంగిపొర్లే దుఃఖంతో) చంద్రంగారు, కుక్క-కంటేహీనముగా వుండాల్సినమమ్మల్ని ఆదరించిఅన్నంపెట్టారు. అత్తరాలా మీమాటప్రకారంనడుచుకోవలసినబాధ్యత నామీదుంది. కాని అందుమూలంగా భరించరానిబాధ పడాలని భయపడుతున్నాను. ఇప్పటికైనా నామీదకనికరం చూపి నన్నుమరువటానికి ప్రయత్నించండి

చం – ఎలా సాధ్యపడటం? ఈ విశాలవిశ్వంలో ఏమూల చూచినా నువ్వేకనిపిస్తావు...నీఅందమేనన్ను వెంటాడుతుంది ఆకర్షించగలపుష్పాన్ని అందుకోని అభాగ్యుడుంటాడా? గౌరీ! నన్నర్థం చేసుకో, నాకు నీ పవిత్ర ప్రేమభిక్షప్రసాదించు మనం పెండ్లిచేసుకుందా.

గౌరి – వద్దు మనంపెండ్లిచేసుకుంటే మాకు యీ తిండికూడా లేకుండాపోతుంది. అమ్మకి ఆగ్రహం కలిగి నన్ను నేకం తూలనాడుతుంది.

చం – భయంలేదు. నన్ను అపార్థం చేసుకుంటున్నావ్. సమయం వస్తే నీకోసం సర్వం త్యజించి వేస్తాను ... భగవంతుడిచ్చిన రెక్కలున్నాయ్. కష్టపడి కూలిపనిచేసి కడుపు నింపుకుందాం.

గౌరి — (ఒక్కసారి చంద్రాన్ని చూసి ఆలోచిస్తూ నెమ్మదిగా) నాకోసం సర్వం త్యజించి వేస్తారా?

చం — అవును. మాటయందు నమ్మకం లేకపోతే ప్రమాణం చేసి చెప్తున్నాను...

గౌరి — (చంద్రాన్ని చూస్తుంది)

చం — నమ్మలేకపోతున్నావా?

గౌరి — హృదయపూర్వకంగా నమ్ముతున్నాను.

చం — (ప్రేమగా) గౌరీ! (దగ్గరికి తీసుకుంటాడు)

గౌరి — (ఆనందబాష్పాలు విడుస్తూ) చంద్రంగారూ!

[చంద్రం గౌరినిముద్దుపెట్టుకోబోతాడు. గౌరితప్పించుకొంటుంటే చంద్రం ఉత్సాహంగా పాడతాడు]

అహాహా—అహాహ్హాహాహా—అహాహ్హా అహాహా
ఆయే నిజమాయే—నాకల నిజమాయే
తీరగ ఆశలు—నా మదిలోరా
తీర్చిదిద్దగ వచ్చితివో ॥ఆయే॥

గౌరి — అహాహా అహాహాహా—అహాహాహాహా
నేనే భాగ్యరాసినిగా—ధన్యురాలనుగా ॥నేనే॥

చం — తళుకు తళుక్ మని—నీ యవ్వనము
చలక్ చలక్ మని నా హృదయమున
మెరుపు తీగగా—మెరియుచుంటివో ॥ఆయే॥

గౌరి — వొకే మాటగ—వొకేపాటగా
ఏకతీగగా—ఎంతోహాయిగనుందాము
ఆడుచుపాడుచు—విహరింతాము ॥నేనే॥

చం — ఆయెగా నిజమాయెనుగా

గౌరి — మనకల నిజమాయెనుగా

తీరుగ ఆశలు—మన మదిలోనూ

తీర్చిదిద్దగ—విహరింతమా

హోయి హోయిగ—ఆడుకుందాము ।ఆయె।

చం — (గౌరిని కౌగిట్లోకి తీసుకొని) మనం ఆదర్శ దంపతు లుగా జీవించి అఖండవిజయాన్ని సాధిద్దాం. ప్రేమకీ పేదరికంతోనూ, సంఘనియమాలతోనూ నిమిత్తం లేదని ప్రపంచం ప్రతిధ్వనించేటట్లు ప్రచారంచేద్దాం. నేటినుండి నీవు నాభార్యవి. (మూర్తి ప్రవేశించి వీళ్ళని చూసి యీర్ష్యగా సకిలిస్తాడు. గౌరి చంద్రలు విడిపో తారు.)

మూర్తి - (నవ్వి) నమస్తే చంద్రంగారూ!

చం — (నొసళ్ళు చిట్లించి) నమస్తే! (విసుగ్గా అంటాడు)

మూర్తి - పాపం దారితప్పి వచ్చేరేం?

చం — వచ్చాను.

మూర్తి — దగా చేయుటానికేనా?

చం — కాదు.

మూర్తి — అయితేం కారణం తెల్సుకోవాచ్చా!

చం — గౌరిని పనికి పిల్చుకు పోవాలని...

మూర్తి — వచ్చి ప్రణయకలాపాలు ప్రారంభించారా!... నేనూ అదే అనుకున్నానులే!

గౌరి — (కోపంగా) ఇంకేం—యిహ దయచేయండి.

మూర్తి — మరి నువ్వేమంటావు?

గౌరి — యిది నా స్వవిషయం.

మూర్తి — సరైనపంథాలో నడిపే అధికారం నాకుంది. చంద్రం గారి సంగతి నీకు తెలియదు. వట్టి మోసకారి... తీయని మాటల్తో తేనెలుకురిపించి అమాయకులైన ఆడవాళ్ళ నెందర్నో అధోగతిపాలు చేశాడు...

చం — (పెద్దగా) మూర్తీ!

మూర్తి — అనవసరం... గౌరీ, కన్నుగానక కామం కళ్ళకి పొరలుగా కప్పి, నీ జీవితాన్ని మలినంచేయాలనిముందడుగు వేస్తున్నాడు... నిన్నూ, నీ గౌరవాన్ని నోడగడ్డలు చేసి గంగపాలు చేయాలని పన్నినపన్నాగం..

చం — (పెద్దగా) ఆపు. (చెంపమీద కొడ్తాడు)

మూర్తి — (వెనుకవున్న కఱ్ఱతీసి) నన్నేను రా కొట్టావు... నువ్వేమవుతావో ఆలోచించుకో. (కొట్టబోతాడు)

గౌరి — (అడ్డువచ్చి) ఆగు... ఏమిటాదౌర్జన్యం?

మూర్తి — (కఱ్ఱ ప్రక్కనేపడేసి, గౌరిముఖంచూసి) నిన్ను క్షమించి వదిలిపెడుతున్నాను. లేకపోతే యీపాటికి యమలోకానికి ప్రయాణంకట్టి వుండేవాడివి... గౌరీ! దూరమాలోచించి మరీమొదలెట్టు నీ ప్రణయ కలాపాలు

గౌరి — (ఆక్షేపణగా) చిత్తం అలాగే!

మూర్తి — (యిద్దర్నీచూస్తూ) నన్ను మర్చిపోకండి, వస్తానూ. (చరచర వెళ్తాడు)

చం — గౌరీ! వీడిక్కడి కెందుకొచ్చాడు?

గౌరి — ఎందుకొస్తాడు నన్ను ప్రేమించాట్ట పెండ్లిచేసుకుంటా డట పగపట్టిన పాములాగా వెంటాడుతున్నాడు.

చం — ఇష్టంలేదనీ, యింటికిరావద్దనీ గట్టిగాచెప్పకపోయావా

గౌరి — చెప్పినా వినిపించుకోందేనా. రావద్దని అనలేకుండా వున్నాను.

చం - ఎందుకని?

గౌరి — వాడు నా మేనమామ.

చం - అంటే?

గౌరి - మా అమ్మకు సొంతొత్తు తమ్ముడు.

చం - అయితేమాత్రం ఇలాంటిదుష్టులకిదూరంగానేవుండాలి

గౌరి — అదంతా వొక పెద్దగాధ తర్వాత చెప్తాను.

చం — ఈ సంగతి మీ నాన్నకి తెలుసునా?

గౌరి - తెలుసును.

చం — ఆయనేమంటాడు?

గౌరి — నిదానంమీాద నిర్మూలం చేస్తానంటాడు

చం - సరె, అర్థమైంది. యిలాంటి నీచులకు తగిన బుద్ధిచెప్పి, వాళ్ళ ప్రవర్తనని సరిదిద్దాలి దానికి అపాయంలేని వుపాయంఆలోచించాలి... వస్తానూ... తిర్గిసాయంత్రం కలుసుకుంటాను.

గౌరి - (సరేఅన్నట్లు తలూపుతుంది)
[చంద్రదంనిష్క్రమిస్తాడు. గౌరిఅతను వెళ్ళినమార్గాన్నే చూస్తూ వుంటుంది]

[తెర]

# పెద పడుచు

## మూడవ రంగం

[స్థలం : చంద్రదంయింటిలో చావిడి. సమయం మధ్యాహ్నం మూడుగంటల ప్రాంతం. సుగుణమ్మ విస్తళ్ళు కుట్తూ వుంటుంది. ముందుకొన్ని బాదమాకులు కొన్ని పుల్లచీకలు, పడుంటాయి మిగిలిన రంగాలంకరణంతో మొదటి రంగంలో వలెనే వుండాలి. కాని పట్టెమంచంమాత్రం వాల్చబడి వుండాలి. గోడఘుటియారం 3 గంటలుచూపించాలి. తెర నెమ్మదిగా ఎత్తబడుతుంది]

తాత – (దగ్గుతూ ప్రవేశిస్తాడు)

సుగు – రా బాబాయ్...

తాత – వస్తున్నానమ్మాయి. వస్తున్నాను. (ప్రవేశించి మంచంమీద కూర్చుంటాడు)

సుగు – ఏమిటి బాబాయి విశేషాలు?

తాత – విశేషాలకేం, వింటేచాలావున్నాయి. అటూఇటూ చూస్తూ చంద్రవం యింటిలోలేడూ?

సుగు – లేదు. ఇప్పుడే అలా వెళ్ళాడు... పనేమన్నా వుందా?

తాత – ఉంది ఎందుకులేదు... సుగుణమ్మా? యిదివరకల్లా చంద్రం చాలా బుద్ధిమంతుడనుకునేవాణ్ని.

సుగు – (ఆశ్చర్యంగా) యిప్పుడో?

తాత – ఏం చెప్పను. ఎలాచెప్పాలో నాకే తెలియటంల్లేదు... చెప్పటానికి మనసంగీకరించటల్లేదు. చెప్పకుండావుండలేకపోతున్నాను.

సుగు — ఏమిటి బాబాయ్. ఎవర్నన్నా ఏమన్నాఅన్నాడా
తాత — అందులో యింకా ప్రవేశించలేదులే అమ్మాయి
సుగు - అయితే యిప్పుడొచ్చిన నష్టం?
తాత — చాలాకష్టమైందే?
సుగు - ఏమిటది?
తాత - ఏముంది! మీవాడీమధ్య పనికిమాలినపనుల్లోదిగాడు
సుగు - ఏంచేశాడు
తాత - ఏంచేశాడా? మీ యింటిలో పనిమనిషి గౌరిని...
సుగు - గౌరిని ఏమన్నా అన్నాడా?
తాత - ఏమంటాడు దాన్నిప్రేమించాట్ట. పెండ్లిచేసుకుంటామట.
సుగు - యెవరు చెప్పారు?
తాత - పిచ్చితల్లి! వొకరు చెప్పాలా? గోడకుచెవులుంటాయి అందరూ అనుకుంటున్నారు.
సుగు — అందుకే నువ్వూ అంటున్నావా? చంద్రం అలాంటి పన్లుచేయడు.
తాత - అలా వీధిగుమ్మంలోకిపోయిచూడు. వూరువూరంతా ప్రతిధ్వనిస్తోంది. అంతేకాకుండా, దానిమేనమామ మూర్తి లేడూ, వాడు ప్రసిద్ధికెక్కిన రౌడీగాడు. వాడు స్వయంగా చూశాట్ట కంటికి కనపడ్డవాళ్ళందరితోనూ చంద్రం అంతు తేల్చుకుంటానని. మీసంమెలేస్తున్నాట్ట
సుగు — ఆఁ.. యదార్థమేనా?
తాత - ఎప్పుడన్నా అబద్ధం చెప్పానా? అయినా ఎలుక పిల్లితో చెలగాటమాడినట్లు ఆ రౌడీగాడితో వీడి

కెందుకు చెప్పు.

సుగు – ఇదెక్కడి పాపఖర్మం అసలే వాడు దుర్మార్గుడు.

తాత – అవును కదా, దుష్టునికిదూరంగా వుండమనిమనవాళ్లు వూరికే అన్నారా?... యితరులు మీ సంసారంలో కల్గచేసుకోటం నాకంతగా ఇష్టంలేదు. పెద్దముండా కొడుకుని, నాకూ మీ పిన్నికీ చిన్నప్పటినుంచి మీ రంటే యెంతో అభిమానం అందుకని విన్న మాట నీ చెవిని వేయకుండా వుండలేక పోయాను... సుగు ణమ్మా! మీ క్షేమంకోరి చెప్తున్నాను పుండు పుట్ట గానే మందువేయాలి. చంద్రాన్ని ఇప్పటికైనామంద లించి మంచిమార్గంలో పెట్టు లేకపోతే చాలకష్టం.

సుగు – యిలా ఎంతకాలంనుంచీ జర్గుతోందో బాబాయ్.

తాత – నేనేంచెప్పనుసుగుణమ్మా! బయలుపడిపదిరోజులైంది

సుగు – యింతవరకూ యెందుకు చెప్పలేదు?

తాత– ఇప్పుడుమాత్రం మించిపోయిందేంలేదు. అసలుదానికి వాడికి సంబంధం యెక్కడచెప్పు? లక్షాధికారి భిక్షాధి కారితో బాంధవ్యమా? పాచిపనిచేసి బతికే దానీ పిల్లని స్థితిపరుడైన మనచంద్రం ప్రేమించటమా? నలు గుర్లోనూ ఎంత నామర్దాపనో ఆలోచించు.

సుగు – అవును బాబాయ్ (పచారంగ) అందుకే నాగుండె నీరయిపోతోంది. తండ్రిలేనిపిల్లాడు. బాగుపడివృద్ధిలో కొచ్చి తండ్రిపేరు నిల్పుతాడని భ్రమించాను. నిమా·

టలు విన్నాక ఆనాటి ఆశ యీ ... డు జీర్ణించింది. ఏం చెయ్యటానికీ పాలుపోవటంలేదు.

తాత - నువ్వేంచేస్తావు. కూడదని చెప్పినాయీ న్నో భయాన్నో వప్పించు...యీలోపున నాలోచించి మంచిసంబంధం తెస్తాను. గుట్టుచప్పుడికాకుండా ఆ మూడుముళ్లూ పడేద్దాం.

సుగు - వాడు నా మాట వినాలిగాని, యితరసంబంధాలతో పనిలేనేలేదు. మీ తమ్ముడుకూతురే వుంది అదికూడా వాడంటే పొంగిపోతుంది.

తాత - అయితే యింకేం? వెతికబోయినతీగ యెదురైనట్లు అన్నీ అనుకూలంగానే వున్నాయ్... వాణ్ణివందరించి వెంటనే వాళ్ళకి ప్రత్యుత్తరం వ్రాయి.

సుగు - అలా జరిగితే అందంగానే వుంటుంది... వాడువప్పుకోవద్దు!

తాత - ఫలితం పొందనా లేకపోయినా మన ప్రయత్నంమనం చేయాలి. నా మాటవిని అలాచెయ్యి. అంతా సర్దుబాటవుతుంద. (ఉగ్రరం బయటనుంచి ప్రవేశించి యింట్లోకి పోతాడు తాత ఇటూ అటూ చూసి నెమ్మదిగా) ముందు దానిని నిగ్గతీసి బెదురుపెట్టు.

సుగు - మూడురోజులున్నించి అది మా యింటి చాయల రావటంలేదు.

తాత - అంతదాకా వచ్చిందీ వ్యవహారం సాగుంది వీడదో దానికి కానిసినపోక నా వ్యవస్థనవకూరుస్తూవుండాలి. యిది మరీ వాటంగా వుందని అది వూరు కోనుండాలి.

యేం చేస్తాం, [illegible] చేతనన్నా కబురుచేసి పిలిపించను. ([illegible]) ముందే నేనలా వెళ్ళొస్తానమ్మాయ్

సుగు — వచ్చాడుగా—[illegible]డిని వాణ్ణి అడిగి చూడరాదూ!

తాత (ఆలోచించి) ముందు అలాగే చేద్దామనుకున్నాను. ఆలోచించినమీదట [illegible]ది. ఆపనేదో నా [illegible]. దీపముండగానే యిల్లుసర్దుకోవా లన్నారమ్మాయి [illegible]స్తానూ (ముక్కు—పొడుం పీలుస్తూనిష్క్రమిస్తాడు)



సుగు — (కన్నీళ్ళు కారుస్తూ మంచంమీదకూర్చుని ఆలోచిస్తు వుంటుంది)

చం — (లోపలినుండి ప్రవేశించితల్లి నిసమీపిస్తూ) ఏమిటమ్మా అలా వున్నావు?

సుగు— ఏం చెప్పను నాయనా! గౌరి పనికిరావటల్లేదు. ఇంటి పనీ వాకిటిపనీ నేనే చేసుకోవాల్సి వస్తోంది. వంచేయటానికి తోచక మధనపడి చస్తున్నాను.

చం — అందుకేనా యీ ఆలోచనంతా! అమ్మా! నువ్వింత అమాయకురాలివేమే పనిమనిషి మానుకుంటే మరో మనిషిని కుదుర్చుకుంటాం. ఎలుకలున్నాయని యింటికి నిప్పంటించుకుంటామా?

సుగు — గౌరి పని మానుకున్నట్లేనా?

చం — లేదమ్మా! వాళ్ళనాన్న నాల్గురోజుల్నుంచీ లేవటం లేదు. అలాంటివాణ్ణి విడిచిపెట్టి ఎలావస్తుంది?

సుగు — అది నీకెలా తెల్సును?

చం — నిన్ననే కనుపించింది. నెమ్మదించేదాకా నాల్గురోజులు పాటు రావద్దని నేనే చెప్పాను.

సుగు — ఈ సంగతి నాతో చెప్పావు కాదేం?

చం — అందువల్ల కష్టంగా వుందని నాకేం తెల్సు?

సుగు — అవును లేనాయనా' నాకష్టం నీకేం తెలుస్తుంది? (కన్నీరు కారుస్తుంది)

చం — (ఆదుర్దాగా) అదేమిటి! ఎందుకలా ఏడుస్తావు? ఎవరన్నా ఏమన్నా అన్నారా?

సుగు — (విచారంగా) ఎవరెందుకంటారునాయనా! నాఖర్మమే నన్ను వెక్కిరిస్తోంది.

చం — నీ మాటలు అర్థం కావటల్లేదమ్మా!

సుగు — గ్రహించలేక పోతున్నావా నాయనా! మీనాన్న ఎంత పరువుగా బ్రతికారో తెల్సునా?

చం — తెల్సును. ఇప్పుడొచ్చిన నష్టం?

సుగు — నీకేం తెలుస్తుంది? పెద్దవాన్ని, బ్రతికివున్నాను కాబట్టి నీ దుష్ప్రవర్తన నా గుండెల్లో గునపంలా గపొడుస్తోంది

చం — దుష్ప్రవర్తనా?

సుగు — అవును.

చం — నేనేం తప్పుచేయలేదే!

సుగు — ఆలోచించి మరీ చెప్పు.

చం — ఆలోచించే చెప్తున్నాను.

సుగు — లోకుల మాటలు వినిపిస్తున్నాయా?

చం — ఏమంటున్నారు? ఎవరంటున్నారు?

సుగు — ఎవర్నంటావు? నిన్ను, నిన్ను బట్టి నన్నూను. నువు గారిని ప్రేమించావని, పెండ్లి చేసుకుంటావని మాటిచ్చా వని ప్రతిచోటా వింటున్నాను. నిజమేనా చంద్రం?

చం — నిజమేనమ్మా, గారిని ప్రేమించినమాట వాస్తవమే. పెండ్లి చేసుకుంటానని మాటిచ్చిన మాట నిజమే అలా జరపాలనికూడా మనస్పూర్తిగా వుంది. అంతమాత్రా నికే యింత దిగులా?

సుగు — దిగులు కాక యేమిటి? నా బాధ నీకేం తెలుస్తుంది? సంఘంలో మీనాన్న సంపాదించిన కీర్తికి నువ్వీ విధ ముగా తప్పుడు పంథాలో నడవటం నీ మనస్సుకి నీకు నచ్చిందేమో చెప్పు.

చం — తప్పులేదమ్మా. పెండ్లికి ముందు కావలసింది ప్రేమే. దానికి జాతి మత భేదాలతోనూ, సంఘం సాకులతోను పని లేదు.

సుగు — గౌరి పేదపడుచు.

చం — అయినప్పటికి శీలవతి.

సుగు — అందుకేనా దాన్ని ప్రేమించింది.

చం — కేవలం అందుకేనని అపోహ పడ్డం పొరపాటు. గౌరి అప్సరస లందరికంటె అందంగా వుంటుంది. దాని అం దానికి అదే సాక్షి. గుణానికి గౌరి తర్వాతనే మరో కళ్ళని చెప్పుకోవాలి.

సుగు — యివేనా కావల్సింది.

చం — అంతకంటే ఏం కావాలమ్మా!

సుగు — కాదునాయనా (విచారంగా) వొక్కకొడుకువి నా అచ్చటా ముచ్చటా నీతో కాక మరెవ్వరితో తీర్చుకుంటాను. వాన్నే చేసుకుంటే బసవయ్య నా ముచ్చటేం తీరుస్తాడు? ఎలా తీరుస్తాడు? మామయ్య లీలని నీకిచ్చి పెండ్లిచేయాలని యెంతో వుబలాట పడుతున్నాడు. అదికూడా నువ్వంటే పంచప్రాణాలూ విడుస్తుంది. అయిన వాళ్ళని ఆదరించి చేరదీయటం మనధర్మం కాని, దాసీదాన్ని ప్రేమించి పెండ్లిచేసుకోవటం తప్పు కాదూ?

చం — మామయ్య మాత్రం స్థితిపరుడా?

సుగు — కాదు కాకపోయినా అయిన సంబంధం.

చం - అందుకోసం నన్ను బాధపెట్టకు గౌరి మనింట్లోనే దాసీది నేను దాని ప్రేమకే దాసుణ్ని...

సుగు - నామాట వినవా?

చం - క్షమించు నా మనస్సునానుండి వేరు కాదు. వేరుచేయాలని ప్రయత్నించనూ వద్దు. నామీద నీకు పవిత్రపుత్ర ప్రేముంటే నన్ను గౌరిని పెండ్లిచేసుకోనియ్.

సుగు - (కోపంగా) అలా జరగటానికి వీలుకాదు. లోకం నన్ను చూసి పరిహాసిస్తోంది

చం - పరిహాసించేది పరువులేని పశువులు. ఎదుటివాని సుఖం చూసి వోర్వలేని వెర్రివెధవలు

సుగు — చంద్రం (పెద్దగా అంటుంది)

చం — అవునమ్మా.

సుగు - నామాటయందు విశ్వాస మనేమంటే యిప్పటికైనా మనసు మార్చుకో.

చం - మనస్సు మార్చుకోనా? జారినమాట పోయినవస్తువు చేసిన ప్రమాణం తిరిగిరావటం చాలకష్టం నేనుచేసిన పని నీకు, నీ మనస్సుకీ కష్టంగా వుంటే యింటిలో నుంచే వెళ్ళుతానులే.

సుగు — (పొంగిపొర్లే దుఃఖంతో) వద్దు చంద్రం, వద్దుమాతృ హృదయం గ్రహించలేక మట్టి లు చేయకు మీనాన్న లేనేలేరు. నా ఆశ న్నీ నీమీదే పెట్టుకు ప్రాకులాడు తున్నాను. (సూర్యం ప్రవేశించి ప్రక్కవుండివింటాడు) నా మూలంగా నువ్వెంతబాధపడకు... నీకు శారిమీదే అంత ప్రేముంటే దాన్నె పెండ్లాడి సుఖపడు.

చం — (ఆనందంతో. అమ్మా! (కౌగలించుకుంటాడు)

సుగు నీ సంతోషమే నా సంతోషం నీ యిష్టప్రకారం దాన్నె పెండ్లాడి సుఖపడు. (బుజ్జగిస్తోంది)

చం — అమ్మా! నిజంగానువ్వుబంగారుతల్లివే! (వెళ్ళబోతాడు)

సుగు — చంద్రం!

చం - (నిలుస్తాడు)

సుగు — ఎక్కడికి నాయనా?

చం— ఈ శుభవార్త నా శారికిచెప్పివస్తానమ్మా.

సుగు — అలాగే నాయనా చూడు, మరోమాట, దాని మేన మామ మూర్తి పేరుపొందినరౌడి. దుర్మార్గుడు. వాడు నీమీద కత్తికట్టాడని విన్నాను. జాగ్రత్తబాబూ

చం - అమ్మా నీ ఆశీర్వచనం గారి పవిత్రపేమ అలాంటి కత్తుల్ని ఎన్నిటినైనా తునకలు చేస్తాయి... వస్తానమ్మా [చరచరా వెళ్ళాడు. సుగుణమ్మ పమిటచెంగుతో కళ్ళ నీళ్ళు తుడ్చుకుంటూ వుంటుంది. సూర్యం చంద్రం పోయిన మార్గాన్ని ఆశ్చర్యంగా చూసి విచారంగా సుగుణమ్మని సమీపిస్తాడు]

సూ - (విచారంగా) పిన్నీ!

సుగు - ఏమిటి నాయనా!

సూ - మీకీనాటికి ఎంతకష్టం కల్గిందో చూశావా పిన్నీ!

సుగు - మాకా! ఏమిటి సూర్యం!

సూ - ఏం చెప్పనమ్మా మీకు కష్టం వస్తే వకటీ నాకొస్తే వకటీనా! మీ కష్టాన్నే నా కష్టంగా భావించి బాధ పడతాను యేమన్నా చెప్తే నమ్ముతావో లేదోనని భయపడుతున్నాను

సుగు - ఫరవాలేదులే చెప్పునాయనా.

సూ - చంద్రం నా ప్రాణమిత్రుల్లో ప్రథముడు. వాడంతే మంచివాడు యిండియాలోనే లేడనుకునేవాణ్ని.

సుగు - (విసుగ్గా) సంగతేమిటో చెప్పు.

సూ - అయ్యో పిన్నీ! ఏం చెప్పను పిన్నీ! ఇరుగుపొరుగంతా యీసడిస్తోంది పిన్నీ, సంఘంలో విలువ పూర్తిగా తగ్గింది. కులంనుంచి ఈవేళో రేపో బహిష్కరింపబడటానికి సిద్ధంగా ఉన్నారు పిన్నీ!

సుగు - కారణం!

సూ — (ఏడుస్తూ) ఇంకా తెలియదా పిన్నీ, చెంద్రం మా యింట్లో పనిచేసే ఆ సీముండని ప్రేమించాట్ట.

సుగు — అందుకేనా?

సూ — యింకెందుకనుకున్నావ్ ముందన్నా జాగ్రత్తగావుండటానికి ప్రయత్నంచేయి పిన్నీ (గెడ్డంపట్టుకొని) నా మాట విను పిన్నీ.

సుగు — భయంలేదు నాయనా! మన్ని ఎవరూ ఏమీ చేయలేరు.

సూ — అలా అనకు పిన్నీ అన్నిరోజులూ మనవికావు. దాని మామమూర్తిగాడు లేమూ (గుండెమీద చేయివేసుకొని) వాడు మండిపడి మారణహోమం చేస్తానంటున్నాడు. (చేయిపట్టుకొని) వాళ్ళ నిప్పటికైనా మంచి మార్గంలో పెట్టుపిన్నీ, వాణ్ని మందలించి ఆముండని గుమ్మంలోకి రానీయకు పిన్నీ... నామాట వినుపిన్నీ.

సుగు — సాధ్యంకానిపనిఆపనిచేయలేను... చేయటానికిమనస్సు అంగీకరించటంల్లేదు... వాడి సంతోషమేనాసంతోషం వాడి యిష్టప్రకారం గౌరినే యిచ్చి పెండ్లిచేస్తాను.

సూ — ఆ! (విసుగ్గా నెత్తిమోదుకుంటూ) అదికాదు పిన్నీ, గౌరివితో తలగోక్కుంటామా చెప్పు వాడి అందానికి యీ అప్సరొస్సేదొరకిందా చెప్పు! సారకాయ చెక్కుల్లే మొహమూ అదీనూ... సంఘం...

సుగు — సూర్యం! యింక నువ్వేమీ చెప్పవద్దు. సంఘంతో నాకు సంబంధంలేదు. సంఘం అనేది మానవకల్పిత మైన మహమ్మారి. ఆ మహమ్మారి మాటల్తో నా మనస్సు మారలేదు. నేను ఆచరించేదకూడా వాడి ఆదర్శాన్నే.

సూ — (నొసళ్ళు చిట్లించి) అదికాదు మీ కాలంలో ముందు ప్రేమించుకోవటమనేది వుండేదా? యిప్పుడు మాత్రం! ఎక్కడున్నా... ఏయిట్లోనన్నా ... పెండ్లి అయాక ప్రేమించుకోవటము దివ్యంగా వుంటుంద అదే మనశాస్త్రసమ్మతం అనాదినుంచివస్తున్న ఆచారాల్ని అనుసరించాలి. కాని అర్థంకాని ఆదర్శాలకోసం ఆయాసపడి ప్రాకులాట్టం మనదేశానికి అప్రతిష్ట... పనికిమాలిన పేదపడుచుతో అందులో పెండ్లికాకుండా ప్రేమకలాపాలు జరుపుతే మన గౌరవం గోడగద్దలు కాకుండా వుంటుందా! చెప్పు పిన్నీ వుంటుందాంట! పెద్దదానివి. నువు గట్టిగా పట్టు పట్టిచెప్తే వాడు కాదంటాడా! (కాళ్ళుపుచ్చుకొని) నాకోసమన్నా మందలించు పిన్నీ.

సుగు — (లేవదీస్తూ) మందలించాను నాయనా, ఫలితంపొందలేక పోయాను. వాడి నిర్ణయాన్ని కాదని నేనేమీ చేయలేను... పోనీ నువ్వైవ దూర ప్రాణస్నేహితులుగా నీమాటేమన్నా వింటాడేమో ప్రయత్నించు.

సూ — అం వింటాడు. వంచేసి కాళ్ళుచ్చుగట్టే పెంపదక! (లేచి) తల్లికి తగ్గకొడుకు. కొడుక్కి తగ్గతల్లి. అనుభవించవాళ్లు

మీరేమన్నా నాకెందుకు. (నిట్టూరుస్తూ) వెళ్ళొస్తాను పిన్నీ. (వెళ్ళబోతాడు)

సుగు — (పిలిచి ఆపి బుజ్జగిస్తూ) సూర్యం! భయపడకు గౌరి దాసీదైనా, పేదపడుచైనా, అది మనింటికొచ్చి కాపురంచేస్తుంది కాని, చంద్రం దానియింటికిపోడు. మసి బొగ్గయినా మెరుగుపెడ్తే మాణిక్యంలాగ కనిపిస్తుంది.

సూ — మీయిష్టం. డబ్బుకలవాళ్లు ఏపనిచేయటానికైనా సమర్థులు. యిదే నాలాంటివాడుచేస్తే నల్గురూ మొహా నుమ్మేస్తారు... పిన్నీ, నీకొడుకు ప్రవర్తన సరిదిద్దుకో. లేదా నువిష్టపడ్డట్టు నేనిష్టపడను అది నా భవితవ్యానికే భంగపాటు (పెద్దగా ఏడుస్తూ) యీ కారణంగా నాకూ చంద్రానికీ వున్న స్నేహం తెగతెంపులుచేసుకుంటున్నాను. మీ గుమ్మం తొక్కటంగూడా నా గౌరవానికి భంగమే.

సుగు — (అంధకారంగా) సూర్యం...

సూ — (పెద్దగా ఏడుస్తూ) సూర్యం సర్వనాశనమైనాడు. ఆనాడే చంద్రాన్ని అర్థంచేసుకున్నాను. (గౌరి నెమ్మదిగా ప్రవేశిస్తుంది. సూర్యం గౌరిని కోపంగాచూస్తూ సుగుణమ్మతో) వస్తాను పిన్నీ. (చరచరా వెల్తాడు)

సుగు — గౌరీ! పనికి రావటల్లేదేమే?

గౌరి — మా నాన్నకి అమ్మవారు పోసిందమ్మా.

సుగు — అమ్మవారా!

గౌరి — (విచారంగా) అవునమ్మా బ్రతుకుతాడనే ఆశలేదు.

సుగు — విచారించకు భయంలేదు ఆ తల్లే కాపాడుతుంది...
సరేగాని చంద్రం మీ యింటికి వచ్చాడా?

గౌరి — లేదమ్మా రాలేదు.

సుగు — నిన్నమొన్నట్లో... (గౌరి 'వచ్చారు' అన్నట్టు తలూపుతుంది) నిన్ను పెండ్లి చేసుకుంటానని మాటఇచ్చాడుటగ?

గౌరి — (భయపడ్తూ) లేదమ్మా.

సుగు — పోనీ ప్రేమించాడా?

గౌరి — లేదు

సుగు — నువ్వన్నా వాణ్ణి...

గౌరి — అ,అ,అ, దీ లే లే లేదు.

సుగు — లోకులు కూసే కాకికూతలు వినపస్తున్నాయా?

గౌరి — ఇల్లువిడ్చి బయటకు రావటంలేదు యేమంటున్నారు?

సుగు — చెప్తున్నాను విను. నీమూలంగా చంద్రాన్ని సంఘం తూలనాడుతోంది నలుగుర్లోనూ నాకుటుంబం నవ్వులపాలౌతోంది. ఇప్పటికైనా నిజంచెప్పి నీ తప్పును ఒప్పుకో మాట్లాడవేం?

గౌరి — (నెమ్మదిగా) నిజమేనమ్మా.

సుగు — పెళ్ళి చేసుకుంటానన్నాడా?

గౌరి — అన్నాడు.

సుగు — అసంభవం, అలాజరగటానికివీల్లేదు. చంద్రం లక్షాధికారి నీవు చంద్రంనీడన బ్రతకవలసిన దానివి. మీ ఇద్దరిమధ్య ఈ దారుణంజరగటానికివీలుపడదు అందుకు నేనొప్పుకోను. జాగ్రత్త. (లోపలికి వెళ్తుంది)

గౌరి - పెద్దగా పేడుతూ చంద్రం!

మంచిరోజు కాదోయ్
మనసునిండ కలతేనోయ్ ॥మంచి॥

అల్లుకొన్నా మబ్బు
మాయమయ్యిందోయ్
వలచి పిలచిన నోరు
కట్టుపడిపోయింది
శూన్యసీమగనుండె
ఈ పేదపడుచుకీ ॥మంచి॥

ఎండనక వాననక
ఎదురు చూచిన నాకు
ఏదారి పోవలెనో
ఏమి కానున్నదో ॥మంచి॥

సుగు — (ప్రవేశించి) పిచ్చిపిల్ల భయపడకు నీ ప్రేమ ఎలాంటిదో అర్థం చేసుకోవాలని ప్రయత్నించాను. అంత మాత్రానికే యింత విచారమా! చంద్రం తప్పకుండ నిన్నే పెండ్లి చేసుకుంటాడు.

గౌరి - (పొంగిపోర్లే ఆనందంతో) అమ్మా!

సుగు — (నవ్వి బుజ్జగిస్తూ) అమ్మ కాదు అత్తను మీ యిద్దరి సంతోషమే నాకూ సంతోషం. ఈరోజే మీ యింటికి వచ్చి మీనాన్నకీ శుభవార్త తెలియజేసి తొందరలోనే మీ వివాహం జరిపే ప్రయత్నం చేస్తాను.

గౌరి — (సంతోషంతో) అమ్మా! కాళ్ళు పుచ్చుకుంటుంది.)

తాత - ఆ పని చేసేది గారిని. నిన్ను కాదు.

సూ - తాతా! తీయని మాటల్తో లోబర్చుకోటానికి నేనేం కుర్రాణ్ణనుకున్నావా? సొమ్ము నేనపహరిస్తే గారినెందుకు జైల్లో వేస్తారు? నీ మాటలు ఏమన్నా నమ్మతగ్గవేనా!

తాత - (నవ్వి) అందులోనే ఉంది అంత రహస్యం కావలంటే కార్యరూపంలోకి తెద్దాం ఏం చెయ్యాలో, ఏలా చెయ్యాలో, ఎప్పుడు చెయ్యాలో చెప్తాను రా. (రెక్క పుచ్చుకుని గుంజుతూ) రావయ్యా అంటే-

సూ - (విదిలించుకొని) అదేమిటయ్యా ఆఘాయిత్యం మండి పోను వద్దయ్యా అంటే, రావయ్యంటావేమిటి? నీ కేమి మతిపోతోందేమయ్యా?

తాత - మతిపోయేది నీకు.

సూ - (ఆశ్చర్యంగా) నాకా?

తాత - నీకే ఆసలు నీ మెదడు మందగించింది.

సూ - అదేమిటి?

తాత - ఏమిటో చెప్తావిను గారిని మన చంద్రం పెండ్లాటం నీ కిష్టమేనా?

సూ - ఊహూ, లేదు.

తాత - లేనప్పుడు నీకీ దయెందుకు?

సూ - దానికీ దీనికీ సమంధ మేమిటయ్యా?

తాత - కావలసినంతుంది. పెండ్లి కాకుండా అడ్డు పుల్లలు వెయ్యటానికి నువ్వొప్పుకుంటావా?

సూ - ఓ అలాంటివి ఎన్నైనా చేయ్ ఆనందిస్తాను.

తాత - అందుకోసమే యీ ఆర్భాట మంతాను.

సూ — అదేమిటి తాతా! నీ మొహం గొంగతనంచేస్తే
పెళ్ళాగిపోతుందా!

తాతా — పెద్దవాళ్ళ మాటలు వేదాక్షరాలనుకో. యిలా రా.
అసలు విసుగుడు చెవిలి పడేస్తాను. (చెవిలో చెప్పి)
అర్థమైందా!

సూ — (ఆలోచించి) ఆ రైటే—అలాచేస్తే బాగా వుంటుంది.

తాతా - ఇంకాజాగుచేస్తావేం! రా (రెక్కపుచ్చుకులాగుతాడు

సూ — వుండవయ్యా (రెక్కవిదుల్చుకొని) అబ్బ.. రెక్కవూడి
పోగలదు... జాగ్రత్త ఇంతికీ ఎక్కడికి రమ్మంటావు!

తాత — మూర్తి దగ్గరకి.

సూ — వాడెవడు?... ఆ కాడీగాడా?

తాత — అవును.

సూ — (గిరున వెనక్కుతిర్గి భయంతో) అయ్యోబాబో! నేను
రాను (వెళ్ళబోతాడు)

తాత — (చెయ్యిపట్టుకుని) భయంలేదు.

సూ — తాతా! పాముతో చెలగాటమనేది మన పని కాదు.

తాత - ఏయ్ ఎక్కడో కాగ్రి వెంకటాయిలాగున్నా వేమిటి!
మూర్తి చాలా మర్యాదస్తుడు మంచివాడు.

సూ — నీపాలిట మంచివాడే కావచ్చు నా పాలిట పగపట్టిన
పాముతో సమానము.

తాత - ఏం!

సూ అలా అడుగు నేను చంద్రం ప్రాణమిత్రులలో. ప్రథ ముణ్ణి అని వాడికి తెల్సును కదా

తాత తెలుస్తే!

సూ - తెలుస్తే బాగా చెప్పావు. వాడిచేతుల్లో పడ్డానంటే ఒక్క దెబ్బతో టపా కట్టాలి. ఎక్కడికి? యమలోకానికి. నేను రాను కలోగంజో వున్న దాంతోనే తృప్తి బడతాను.

తాత - పోనీ, నీ ప్రాణానికి నా ప్రాణం అడ్డంవేస్తాను. రా.

సూ - (తాతచేతులుపట్టుకొని) నన్నువదలిపెట్టు కావాలంటే కాళ్లుపుచ్చుకు బ్రతిమిలాడతాను. తాతా, చంద్రం స్నేహం వదలుకున్నా నాకీ బాధెందుకు చెప్పు కావా లంటే వాళ్ళయింటిచాయలక్కూడాపోను. సరా!

తాత - అదేంమాట! నేను మాత్రం వాళ్ళింటికి పోవటల్లేదా రావటల్లేదా? వాళ్ళమీదుండే ప్రేమచేతనైతే కాని, మరింకెందుచేతనైనా కాని, గారిని విడ్చిపెట్టమని ఎన్ని సార్లు బ్రతిమిలాడాను. విన్నారా.

సూ - నామాట విన్నారుకాబట్టా, నీ మాట వింటానికి

తాత - అందుకే ఇద్దరం కలసి మనమాట నెగ్గించు కోవాలి మనం వాళ్ళింటికిపోయి వస్తూవుండాలి, మనపన్లు మనం చేస్తూవుండాలి. (అటూ ఇటూ చూచి నెమ్మదిగా సూర్యం యీ పని మనం చేశామంటే మనకి ఆరు వందల రూపాయలు సునాయాసంగా వస్తాయి. చెరో మూడువందలు పుచ్చుకుందాం.

సూ — (సంతోషంగా) ఆఁ మూడువందలే! అయితేయిప్పుడే వస్తాను (వెళ్ళబోయి) తాతా ఎందుకన్నా మంచిది వాడిదగ్గర ఆరువందలూ నువ్వేతీసుకొని నా మూడు వందలూ నాకు పారేయ్.

తాత — (నాలుక చప్పరించి) లాభంలేదయ్యా యిద్దరంకలసి పోవాలి. యీపనిమావల్ల అవుతుందని వాడికి గట్టిగా మాటివ్వాలి. అడ్వాన్సుగా వందో రెండువందలో మనం అత్యవసర ఖర్చుల కింద పుచ్చుకోవాలి.

సూ - (బుర్ర గోక్కుంటూ ఆలోచించి) అయితే ఒకపనిచెయ్యి నేను బయటనిల్చుంటాను. నువ్వు వెళ్ళి వాడితో అంతా మాట్లాడేసి, అడ్వాన్సు తీసుకురా... నేనుకూడా అక్కడికి తప్పనిసరిగా వస్తేగాని పనిజరగదని నీ మనస్సులో వుండి, నాకు ప్రాణభయంలేదని నీకు గట్టిగా తోస్తే వచ్చి నన్నుకూడా తీసుకుపో. ఏం?

తాత — సరె పద.

[యిద్దరూ వెళ్తారు. అనంతరం తెర ఎత్తబడుతుంది... టేబుల్ మీద మూర్తి ఫోటో అలంకరించిన స్టాండు ప్రక్కగా కొన్ని పుస్తకాలువుంటాయి. దానికి సమీపంలో రెండుకుర్చీలు, దగ్గరగా వాలుకుర్చీ—అందులో మూర్తి పడుకొని సిగిరెట్టు కాలుస్తూ పత్రిక చదువుతుంటాడు. నాగన్న నెమ్మదిగా ప్రవేశిస్తాడు]

మూర్తి — నాగన్నా వెళ్ళిన పనేమయింది?

నాగ - ఇంటికాడోరూ లేరుదొరా,

మూర్తి – మనవసరంకాదూ, మళ్ళీ వెళ్ళాలి.

నాగ – ఒకసారా? ఆలిముండ మొయ్య ఆరుసార్లెల్లాను. అంటుంటేనా.

మూర్తి – వూళ్ళో వున్నాడా?

నాగ – వుండకేడకెల్తాడు? వున్నాడంట.

మూర్తి – యెవరు చెప్పారు.

నాగ – ఆల్లింటిపక్క పంతులుగోరు.

మూర్తి – పోనీ, సూర్యం కనుపించాడా!

నాగ – ఎప్పుడుచూచినా వేసిన తలుపులు వేసినట్టేవుంటాయి. (నవ్వి) ఆలిముండా మొయ్య అసలాయినప్రపంచకంలో వున్నాడో వూడిపోయాడో అసలే తెల్దు.

మూర్తి – మా బావ కెలావుండో విచారించావా?

నాగ – ఆ బాపంటే గుత్తుకొచ్చింది. అమ్మవారు శెలవిచ్చిందంట, కాని...

మూర్తి – యేమిటి?

నాగ – ఏటుంది? మీబావ బసవయ్యగోరు ఆరునెల్లమట్టి యింటికాడుగ యియ్యటంలేదంట కామందుకి కోపమొచ్చి కట్టంగా మాట్టాడంట.

మూర్తి – (పకటంగానవ్వి) ఇదంతా ఎవరి సన్నాగమంటావు

నాగ – (ఆశ్చర్యంగా) ఏంటి దొరా? ఆలి ముండా మొయ్యా మీరు పన్నిందేనా?

మూర్తి – ఏమనుకున్నావు? మూర్తి తల్చుకొంటే ముప్పయితిప్పలు పెట్టి మూడుచెర్వుల నీళ్ళు తాగిస్తాడు.

నాగ —హిహిహిహిఅయ్యగారివాలకంలో నేకనిపిస్తున్నాయిగా
మూర్తి — ఆ... తర్వా తేమ్తోంది.
నాగ — ఏముంది...మీ గారమెల్లి యీ సంగతంతా సెం
ద్రయ్యతో సెప్పిందంట.
మూర్తి — వాడు దానికి సహాయపడ్డాడనా?
నాగ — పడ్డాడుగా!
మూర్తి — మూతిపళ్ళు విర్గాయా?
నాగ — ఆలిముండ మొయ్యఆపట్టంకాదు. ఇంటికిందియ్యాల్సిన
అద్దెంతా యిసిరికొట్టి ఆ యిల్లు కాలీసేయించాడంట.
మూర్తి (ఈర్ష్యగా) ఇల్లు ఖాళీచేయించాడా!
నాగ — అవును దొరా!
మూర్తి — యెక్కడికి మార్చాడు.
నాగ — చూస్తాగా ఆల్లింటికాడే ఎట్టేశాడంట.
మూర్తి — (విషపుచూపులతో సిగరెట్టుపీల్చి పొగవదుల్తూ)
పెద్దచిక్కే వచ్చిందే!
నాగ — ఏం సిక్కు దొరా?
మూర్తి — పన్నిన పద్మవ్యూహం...
నాగ — యింకా ఝాలుగా అవుద్ది
మూర్తి ఏవిధంగా?
నాగ — (నవ్వి) నా మామూలు కాష నాలుకసప్పరించకుండా
వుండారంటే-ఆలిముండ మొయ్యఆళ్ళంతు తేల్చుకోనూ
(మీసందువ్వుకుంటూ) నాగన్న తలుసుకుంటే ఆళ్ళం
దర్ని అరసేతులో పెట్టుకుఆడించడమూ హూఁ...

మూర్తి – మూర్తికి కుడిభుజం నువ్వేగా... నీకా్కవలసింది నే నెప్పుడిక్వలేదు గారి నాది కావాలిగాని, నిన్ను అందలంలో పెట్టి పూజచేయించనూ.

నాగ – (నవ్వి) అనుకుండాలే. ఆలిముండ మొయ్య! ఆమాటే అనుకుండాలే సరేకానిదొరా! మనం ఎంతో జాగ్రత్తగా పనిశేత్తేనేగాని పసందుగా పన్లీడేరవు.

తాత – (బయటనుంచి ప్రవేసించి) నమస్కారం మూర్తి! (కూర్చుంటాడు).

మూర్తి – ఎందుకండి?! ప్రయోజనంలేనిమొక్కుబళ్ళు వాళ్ళ సంసారమంతా నీచేతుల్లో వున్నట్లు చెప్పావు నాచేత అయినకాడికి డబ్బు తగలేయించావు వెళ్ళావు, వెళ్ళిన పని ఖాళీచేసుకొచ్చావు?

తాత – నే నేం చేయను చెప్పండి వాళ్ళు నామాటయందు విశ్వాస ముంచుతారనుకున్నాను తల్లిముండకి పెట్టాల్సిన తంపులన్నీ పెట్టాను. చెప్పవలసినసాకులన్నీ చెప్పాను. గారిని పెండ్లాడితే వాళ్ళ గౌరవానికి భంగంకల్గుతుందని నలుగుర్లోనూ విలువతగ్గి వీధికెక్కుతారని మూర్తితోవిరోధం త్రాచుపాముపగతో సమానమని అబ్బబ్బ... వొకటా ఎన్నో చెప్పాను. కు రపెథవ చెద్రం వినంది తల్లిమాత్రంఎంచేస్తుంది చెప్పండి?

మూర్తి – మంచిపని చేసింది. ఎదటివాణ్ణి వెథవని చేయాలని వాళ్ళనికూడా తనింట్లోనే పెట్టుకుంది.

తాత — విన్నాను. అంతా విన్నాను ఏమీ చేయలేక వూరుకున్నానా! సమయం చిక్కాలి సర్వం సానుకూలపడాలి.

నాగ — ఆలీముండ మొయ్యా! అద్దదేగా నేను సెప్పేదీను.

తాత — తగ్గరా నాగన్నా!

నాగ — సరే పటిసిత్తాను తగ్గాను.

మూర్తి — నిమ్మల్నందర్నీ చేరదీసినందుకు మా పనులన్నీ మా చక్కా నెరవేరుస్తున్నారయ్యా డబ్బు మాత్రం ఎక్కడిదక్కడ కరిగిపోతోంది. కావలసిన పని ఆవగింజలో అర్ధభాగమన్నా కాలేదు... నా డబ్బు తింటున్నందుకు మీ మీద నాకు సర్వహక్కులు వున్నాయ్. మీ చేత ఏ పనైనా చేయించుకోవచ్చు అందుకేనా కోపానికి గురికాకుండా కార్యం సాధించే మార్గం కనిపెట్టండి.

నాగ — అదేగా నేను సెప్పేదీను.

మూర్తి — (కోపంగా) నోరుమ్మయ్.

నాగ — (ఉలిక్కిపడి నోరుమూసుకుంటాడు.)

మూర్తి — (పెద్దగా) తాతా మాట్లాడవేం!

తాత — వేరే దారేది కనుపించటంల్లేదు... వొక్కటే మార్గం కనుపిస్తోంది.

మూర్తి — యేమిటది.

తాత — సూర్యం ద్వారా. సుగుణమ్మయింట్లో దొంగతనం చేయించి నేరం దానిమీద పెట్టాలి.

మూర్తి — పెద్దే!

తాత — దాన్ని అరెస్టు చేస్తారు.

మూర్తి - చేస్తే.

తాత — ఇంకేముంది పీటమీద పెళ్ళి ఆగిపోతుంది. వాళ్ళ పరువు వీథిపాలవుతుంది... చంద్రానికిఅదంటే విరక్తి పుట్టుంది.

మూర్తి — అందుమూలంగా మనకొచ్చేలాభం!

నాగ — ఆలిముండామొయ్యా అంతా లాభమేగా!

మూర్తి — నువునోర్మూయి.

నాగ — కాద్దొరా!

మూర్తి - అయే డేమిటి?

నాగా — అట్టా అడుగుదొరా! దొంగతనం ఎనకాల—(కన్నుకొట్టి) అదికూడా కట్టామంటే కాలుకాలిన పిల్లిలాగ అయిన వాళ్ళకోసం ఎదురు సూచుకుంటూ మన గూట్లోకొచ్చి పడుద్ది.

మూర్తి — తండ్రి బసవయ్యుండగా...

నాగ — అట్టారండి దారి- మనకి కూనీలుసేయుటం సేయించటం అలవాటేకందా ... ఆ నాయాలుగాణ్ణి ఆలిముండామయ్యా! అయిదు నిమిషాల్లో అంతం సేయించి పారేత్తాను.

మూర్తి — [ఆలోచిస్తూ] ఫలితం, వుంటుందా?...

తాత — తినబోతూ రుచడుగుతారేం మీరే చూద్దురుగాని.

మూర్తి — సూర్యం చంద్రానికి ఆప్తమిత్రుడు, యీపనికి వాడు అంగీకరించడు.

తాత - అవసరమైతే వాణ్ణి తమ కాళ్ల దగ్గరికి తీసుకొచ్చి మరీ చెప్పిస్తాను సూర్యం చంద్రంతో స్నేహం చేయటం లేదు. తమరు అంగీకరిస్తే తమ అండగా పనిచేస్తాను. అందుకు సిద్ధంగా వున్నాడు.

నాగ - ఆలిముండామయ్యా, యింకేం... నాకింక అడ్డనే లేదు. (నవ్వుతాడు)

మూర్తి - చంద్రానికిసూర్యనికిస్నేహం ఎందుకు చెడిపోయింది

తాత - యిందుకే, పరువులక్కువ పేదపడుచుతో ప్రణయకలాపాలు ప్రారంభించినందుకు, మాకు అన్యాయం జరక్కుండా మాకురావలసిన బహుమానం మాకిస్తేనా! వాడు మేమిద్దరం తమకిరెక్కలుకంటే ఎక్కువగా పని చేస్తాం, మాటయందు నమ్మకం మాత్రం వుంచండి.

మూర్తి - [ఆలోచించి] సరె సూర్యాన్ని నాదగ్గరకు తీసుకొచ్చి వప్పించు.

తాత - ఇప్పుడే చెప్పిస్తాను. నాగన్నా! యిలారా, బయట బొంగడ చెట్టు క్రింద సూర్యం కూర్చొనుంటాడు వెళ్ళి తీసుకురా.

నాగ ఓ. ఆలిముండమొయ్యా! అరనిమిసంలో తీసుకొస్తాను (వెళ్తాడు)

మూర్తి - సూర్యం నీతో ఎందుకు రాలేదు?

తాత - తమ మాట చెప్తేనే భయపడుతున్నాడు.

మూర్తి - ఎందుకు భయం?

తాత-వొకప్పుడు చంద్రం స్నేహితుడుకాదూ... ఆకోపంతో పీడికేదన్నా హానిచేస్తారేమోనని.

మూర్తి - (వికటంగానవ్వి) అమాయకుడు ... తాతా!వొక పనిచెయ్. నువ్వీపక్కగదిలోకిపో సూర్యంతో నేను మాట్లాడతాను.

తాత - చిత్తం...[లోపలకు నిష్క్రమిస్తాడు] బయటనుంచి నాగన్న సూర్యాన్ని వెంటపెట్టుకుప్రవేశిస్తాడుసూర్యం మూర్తిని చూసి వణికిపోతాడు.

సూ - [వణకుతూ] త త త తా తే డి

నాగ - యెందుకు?

సూ - త త త త తాత రమ్మన్నాడన్నావు

నాగ - ఆలిముండమొయ్యా అన్నాను

మూర్తి - అంటే అన్నాడుకాని, ఎందుకు భయపడ్తావు?

సూ — (వణకిపోతూ) భ భ భయం కాదండి యిది వొకరక మైన జబ్బు

మూర్తి - అరె, కాళ్ళ లావణకిపోతున్నా యేం?

సూ — అ అ అ జబ్బుకు లక్షణాలే అవి.

మూర్తి — (నవ్వి) మళ్ళీరాకుండా మంచి మందివ్వనా?

సూ — వ వ వద్దు...అ అ ఆ అదే పోతుంది.

మూర్తి — ఇక్కడి కెందుకొచ్చావు?

సూ — ఆ! నాగన్నతాతగారుపిలుస్తున్నారనితీసు కొచ్చాడు. ఏరా. నాగన్నా! అయ్యాగారితో చెప్పవేం? అడగం డింకాను... వెళ్ళస్తానండి. (రెండడుగులు వేస్తాడు)

మూర్తి - (పెద్దగా) ఆగు.
సూ — (ఉలిక్కిపడి ఆగుతాడు)
మూర్తి - వచ్చినవాళ్ళు పనికాందే వెళ్ళటానికి వీల్లేదు.
నాగ — ఆలిముండామయ్యా అంతేదొరా! (నవ్వుతాడు)
సూ — నాగన్నని కోపంగాచూసి (మూర్తితో) పనేదో శెలవియ్యండి.
మూర్తి — (కోపం అభినయిస్తూ) నాగన్న నిన్నెందుకు తీసుకొచ్చాడో తెలుసునా?
సూ — (గడ్డం మీటకరిస్తూ గుటకలు మింగుతూ) తెతె తెలియదు.
మూర్తి - (ఈర్ష్యచూపిస్తూ) నాకసి తీర్చుకోటానికి.
సూ — (శాగావణుకుతూ) రాను రాము. నేనేం చేశానండి పొరపాటునన్నా తమర్ని పల్లెత్తుమాటనలేదే? నన్ను క్షమించండి — నాకేమిటో భయంగావుంది. వెళ్ళిపోతాను.
మూర్తి — వీలుపడదు నేనడిగినప్రశ్నలకి సామాధానం చెప్పి మరీ వెళ్ళు.
సూ — (నీరసంగా) ఆలస్యంచేయకుండా అడగండి మరి.
మూర్తి - చెంద్రం యెక్కడ?
సూ - యింటిదగ్గర.
మూర్తి — ఏం చేస్తున్నాడు?
సూ - తెలియదు.
మూర్తి · యెందువల్ల!

సూ - నేను వాళ్ళింటికి వెళ్ళటం మానేశానండి.
మూర్తి — (కోపంగా) ఊ అబద్ధమాడుతున్నావ్. జాగ్రత్త
సూ - లేదు. ప్రమాణపూర్తిగా వెళ్ళటంలేదు.
మూర్తి— పెళ్ళెప్పుడు?
సూ - ఎవరిదండి?
మూర్తి— నీరిది ఎప్పుడు?
సూ— అవుతుందండి
మూర్తి — ఎవరితో?
సూ - చంద్రతో కాదు కాదు (నాలుక కరచుకొని) మీ మీ
మీతోనే మీతోనే, మీతోనే
మూర్తి- (రెండడుగులు వేసి) ఏయ్ వేళాకోళంగావుందా?
నాగ - ఆలిముండమొయ్యా అంటించండి ఆరెదెబ్బలు.
సూ — (నాగన్నతో నెమ్మదిగా) నీకేమన్నామతిపోతోందా
మూర్తి - నీరిని చంద్రం పెళ్లాట్టం నీకిష్టమేనా?
సూ — లేదండి.
మూర్తి — కారణం
సూ — ఆ పెండ్లి సుతరాం నాకిష్టం లేదండి, భాగ్యవంతుడు
చెంద్రం దాసీపని చేసుక్రబతికే నీరిని చేసుకుంటా
నంటే నేనొప్పుకోనండి.
మూర్తి - ఆ సలహా నీమిత్రుని కిచ్చావా?
సూ - ఇచ్చానండి. "ససేమిరా" అన్నాడు
మూర్తి - అయితే ఆ పెండ్లి నీకు యిష్టంలేదన్నమాటేగా!
సూ — అక్షరాలా యిష్టంలేదండి.

మూర్తి - పీటలమీదపెళ్ళి జరక్కుండా తతంగం చేయ్యటాని కిఅంగీకరిస్తానా?

సూ — (వినయవిధేయతచూపుతూ) చిత్తం అంతకంటే కావ లసిందేముంది?

మూర్తి — నానుండి నీకు భయమేమీలేదు. నిన్ను నాఆప్తు ల్లో అగ్రగణ్యునిగా ఆరాధిస్తాను... నేను చెప్పినట్లువి ను... నీవు కోరినంత డబ్బిస్తాను.

సూ — హిహిహిహి... చంప్పారండి, అంతాతాతగారుచెప్పా రండి,

మూర్తి - అన్నింటికీ అంగీకరించినట్లేగా?

సూ — (ధైర్యం తెచ్చుకుంటూ) కావాలంటే చేతిలో చెయ్యేసి చెప్తాను... చెప్పేదొకటి చేసేదొకటి మన జాతకంలోనే లేదు.

మూర్తి - (ప్రక్కకుతిరిగి) తాతా!

తాత — (ప్రవేశించి) ఏమి శెలవు?

మూర్తి - సూర్యాన్ని నీకు అండగా యిస్తున్నాను... యిద్ద రుకలసి కార్యాన్ని సాధించండి

తాత - చిత్తం

సూ — (నెమ్మదిగా తాతతో) మరి డబ్బుసంగతి?

మూర్తి — ఏమిటీ రహాస్యం?

తాత - అవసరపుఖర్చులక్రింద ఏదో...

మూర్తి — నాగన్నా, వాళ్ళకు కావలసింది యిచ్చిపంపు.

నాగ — సిత్తం... [సూర్యంతో] అలిముండామయ్యా ! ఆరం

భంలోనే అడవాన్ని కొట్టేశారు. (వెళ్ళిపోతాడు)
మూర్తి — వినండి నామాట శ్రద్ధగా వినండి రేపు సాయం
కాలానికి సగంపని పూర్తి కావాలి జాగ్రత్త.
తాత - చూస్తారుగా యీసారి. (మీసం మెలేస్తాడు)
సూ — (వెకిలిగా నవ్వి) బలేగా అన్నావు.
నాగ - ఆలి ముండామయ్యా రండయ్యాంటే—
(నాగన్న, తాత, సూర్యంలోపికిపోతువుంటారు మూర్తి
విరగబడి వికటంగా నవ్వుతాడు)

[తెర]

# పేదపడుచు

## అయిదవరంగం

(స్థలం చంద్రంయింట్లోదొడ్డివైపు వరండా, సమయం రాత్రి పదకొండు గంటలు. బసవయ్య పట్టెమంచంమీదపడుకొని నిద్రపోతూవుంటాడు. సమీపాన మరో మంచంమీద పక్కవేసి గౌరికోసం సిద్ధంగా వుంటుంది. కొద్దిదూరంలోహరికేన్ లాంపు వెలుగుతూవుంటుంది. దానికి పక్కగాకూజ, గ్లాసు కిటికీవూచలగుండా చంద్రకాంతి లోపలపడ్తూవుంటుంది గౌరి కిటికీ వూచల్ని పట్టుకుని చంద్రుణ్ణిచూస్తూ పాడుతూ వుండగా తెర ఎత్తబడుతుంది)

గాడోయి రావోయి
ఓ చందురూడ

మెల్లగా రావోయి
నా చెందురూడ ॥రావో॥
కిలకిలా నవ్వాలి
మెల మెలా మెరవాలి
హోయిహోయిగ నా
కానందమును గూర్చ ॥రావో॥
మనసులో శేకెత్తి
నా ప్రేమ పూహలు
నవ్వుతూ నానుండి
అందుకో రావోయి ॥రావో॥
చల్లని వెన్నెల్లో
పూవులా ఘుమఘుమలో
నీప్రేమ బాసలతో
నన్ను నవ్వించగ ॥రావో॥

బస — [నిద్రనుండి లేచి) చాలా పొద్దుపోయింది. యింకా పడుకో లేదేం గౌరీ!

గౌరి నిద్రపట్టటలేదు... పడుకుంటా.

బస — చంద్రుంకోసమేనా యెదురుచూసేది!

గౌరి — కాదు నాన్నా (సిగ్గుపడ్తుంద]

బస — (నవ్వి) పిచ్చితల్లీ పెండ్లికాండే ప్రియునికోసం ఎదురు చూడకూడదమ్మా శాస్త్రంసమ్మతించదు. లోకంవిరగ బడినవ్వుతుంది. మనం నిజంగా అదృష్టవంతులం కను కనే సుగుణమ్మ తల్లికూడ యీ పెండ్లి చేయాలని పటు

పట్టింది. దిక్కులేనిదరి(దులెన్తో అల్లాడిపోతున్న మన్ని దయార్ద్రహృదయంతో దారిచూపి దరికిచేర్చుకుంది. . లేకపోతేదగా చేయాలని ఎదురుచూసేమీమామాయ్యా మర్మాలతో (మగ్గి మస్తె పోయేవాళ్ళమే?

గౌరి - అవును నాన్నా మామయ్య (ప్రతిజ్ఞవినాన్నావా?

బస – (నవ్వి) పిచ్చితల్లి! పటుత్వంలేని (ప్రతిజ్ఞలు చేశాడని భయపడకు,ఎప్పుడో వాడిపాపం వాణ్ణే దహిస్తుంది.

ఆనాడు మన కెదురు తిర్గినసంఘం ఈనాడు కాశీ పోయినా, మరోనాక్టైనా వాణ్ణే వీథికి లాక్కపోదు. (నీరసంగా ఆవలించి) ఉ... ఆయాసంగావుంది మాట్లాడలేను. పోయి పడుకో తల్లి!

గౌరి–అలాగేనాన్నా(ఆలోచిస్తూ చం(దుణ్ణిచూస్తూ వుంటుంది)

బస – యేమిటమ్మా ఆలోచన? దేన్ని గురించి...

గౌరి – నిండు చం(దుని నాట్యం చూస్తున్నా నాన్నా...

బస - [నవ్వి) వె(రితల్లి! . . చాలుగాని వెళ్ళిపడుకో.

గౌరి - (సిగ్గుతో పడుకొంటుంది)

బస -[ నెమ్మదిగాలేచి కూజాదగ్గరకువెళ్ళిసీళ్ళు(తాగొచ్చిమంచంమీద కూర్చు(టాడు)తల్లిలేకపోయినా గౌరినిఅల్లారుముద్దుగా పెంచుకుంటూ, దాన్ని చూసి ఆనందిస్తూ రోజులు గడుపుతున్నా... గౌరికి నాచేతిమీదుగా పెండ్లి చేయలేనేమోనని భయపడ్డాను, ఆ అవకాశం దానంతటదే దొర్లుకొచ్చింది. కాస్తఆరోగ్యం చేకూరగానే ఆము ముముభ్యాపడేయించే పయత్నాలు పారం

భిస్తాను. దాన్ని దాని అత్తవారింటికిపంపాక నేనెప్పుడు పోయినా నాకు చీకూచింతా వుండదు... సుగుణమ్మ తల్లి ఆనాడు చల్లని మనసుతో చేరదీయకపోతే ఈనా టెక్కడుండేవాళ్ళమో! అంతా ఆ పరంధాముని మాయానాటకం. (ఆవలించి)ఉ... అమ్మ... (అంటూ నడుం వాలుస్తాడు. కొంతసేపటికి తెరలో దొంగలు పడ్డట్లు హడావిడిగా మాటలు వినపడతాయి. బస వయ్య లేచి కూర్చుని గాబరా (వింటూవుంటాడు.)

తాత - (తెరలో) ఆలోచిస్తారేం! రండి దొంగతనంచేసింది ఆ ముండేనని తేలిపోయిందిగా... (సుగుణమ్మ, తాత, సూర్యంవిసురుగా ప్రవేశిస్తారు.]

సూ - (పెద్దగా నవ్వి) ఆక్షేపణగా ఒహోహో - చూడండి దొంగముండ ఎలానిద్రపోతుందో... నిజం నిద్రవుతే యింత హడావుడి జరుగుతుంటే మెలుకువ రాకుండా వుంటుందా... ఛాఛాఛా. . .యిలాంటి అలిముండలకి చనువిచ్చి యింట్లో చేరదీయటమే పెద్దతప్పు.

బస - [గాబరాపడ్తూ నెమ్మదిగాలేచి) ఏమిటి? అదేం తప్పు చేసింది? శాంతంగా చెప్పు సూర్యం.

సూ - [తెల్లబోయిచూస్తూ] ఆరము ండా కొడకా! వుత్తన్నా ముడిపళ్ళేదు అప్పుడే నీకు నేను సూర్యం అయానా! జాగ్రత్తగా మాట్లాడు, కోరలు పీకిస్తాను.

బస - క్షమించండి పొరపాటున అన్నాను.

సూ — వూరుకొంటే అదే అలవాటు చేసుకుంటావు. నీకేం నీతా నియమమా? (పెద్దగా) ముండని యీడవండి మంచం మీదనుంచి.

గౌరి — (తృళ్ళిపడి లేచి అందర్నీ ఆశ్చర్యంగాచూస్తూ సుగుణమ్మని సమీపిస్తుంది.

సుగు — (దూరంగా నెట్టి) ఛీఫో సిగ్గులేని ముదనష్టపదానా! నిన్నేంచేస్తే పాపముంది? మాపాలిట పెనుభూతంలాగ దాపరించింది కాకుండా దగ్గరకూడా వస్తున్నావ్?

గౌరి — (ఏడుస్తుంది)

బస — (అర్థంకాక] ఏం చేసిందమ్మ ? దానిమీద అంతే మండిపడి పోతున్నారు.

సుగు — (ఈర్ష్యగా) ఏంచేస్తుంది? మాకొంప దోచేసింది.

తాత — (కోపంగా) ఇంట్లోతిని యింటివాసాలు లెక్కెట్టింది.

గౌరి — [అంధకారంగా] ఆ!

సూ — (నవ్వి) ఎంతసంగనాచివే! ఏమీ ఎరగనట్టు నాటకమాడుతున్నావ్? ఛా ఛా ఛా (సుగుణమ్మతో) చూశావా పిన్నీ! నమ్మి ప్రపంచంలో మంచిఅనేది ఎవ్వరికీ చేయకూడదని యిప్పటికైనా తెలుసుకో.

గౌరి — సుగుణమ్మగారూ! (ఏడుస్తూసమీపిస్తుంది)

సుగు — [కోపంగా] ఎందుకు? మా అబ్బాయిని ప్రేమించి కపటంగా నటించి మమ్మల్ని మావంశాన్ని నామర్దా పరిచింది కాకుండా నిలువునా నాశనంచేద్దామనుకున్నావా.

గౌరి — లేదు. నేనే పాపం ఎరుగను. నేను నిర్దోషిని.

సూ - అంతేలే! దొరికితే దొంగ, దొరక్కపోతే దొర ... ఆ జాతిలక్షణమే అంత.

బస - (కోపంగా సూర్యాన్ని చూస్తూ) మాటలు హద్దుమీరుతున్నాయి

తాత - చేసినపనికి హద్దుమీర్తాయా? అంతం చేస్తాయా!

బస . ఆవేశముతో అనవసరంగా అనుమానిస్తున్నారు.

సూ - అనుమానించటం దేనికి? కళ్ళకి కనుపిస్తుంటేను.

బస - యేమిటయ్యా నీ క్కనుపించేది.

సూ - నీ కూతురు చేసినపని...

బస - ఏం చేసింది?

సూ - ఏం చేసిందా? (ఈర్ష్యగా చిరునవ్వు నవ్వి) పాలుపోసి పెంచినవాళ్ళకి పరాభవం చేసింది... అయినా మమ్మల్ని అనుగుతావేం దాన్నే అడిగి తెల్సుకో... ఏమే! (సమీపించబోతాడు)

బస - (పెద్దగా)ఆగు! చేసినతప్పురుజువుచేసి దండించటంధర్మం

సూ - రుజువుచేయాలా? (నవ్వి) ప్రత్యక్షంగా కళ్ళకికనిపిస్తుంటే పేదవాళ్లని ఆదరించినందుకు చంద్రంజీవితం అంధకారంచేసింది. మరొక రంకుమొగుణ్ణిమరిగిన,మమకారంతో మంచి చెడ్డలు లేకుండా యింట్లోపడి అయిదు వందలరూపాయలు అపహరించింది.

గౌరి - ఆఁ! అంతా మోసం. ఆపని నేను చేయలేదు.

సూ - (పళ్ళుకొరుకుతూ) రంకులాడి నిన్నెంచే స్త్రీపాపముందే లేదంటే సరిపోతుందనుకున్నావా? వాణ్ణే మరిగిన

మాయలాడివి చెంద్రాన్నెందుకు మోసగించావు. వంచకీ!

గారి – [విసురుగా సూర్యాన్ని చెంపమీద కొట్టి, నోర్మూయ్.

[దవడ సవరించుకుంటూ]

సూ – చూశారా! అందరు చూశారా! యింకా ఏంకాలం చెప్పండి సాపిష్టి కాలం! యింతమందిలో ఆడది క్షైర్యం చేసి, చేసిన తప్పుచాలక మగవాణ్ణి చెంపదెబ్బ కొట్టిం దంటే, ఎంత నానుర్ధాపనో చూడండి(గాబరాపడ్తూ) చూస్తావేం పిన్ని ! పాడుముండని పీకపిసక్క...

సుగు – చాలు... జర్గినఅవమానాలుచాలు. దాన్ని బయటికి పంపండి... దొంగముండనినా యెదురుగుండా లెమ్మ నండి.

బస – దాసీగా వున్నంతమాత్రాన దానిమీద ధర్మం లేకుండా దొంగతనాన్ని పడేయకండి. మీకూడు తింటున్నంత మాత్రాన వెనకముందులు అలోచించకుండా నోటి కొచ్చిన కూతలు కూయకండి. అన్నం లేకపోయినా మీకంటే మేమే పరువుంగా బ్రతుకుతున్నాం.

సూ – నోర్మూయ్యరా పక్షీ ! సిగ్గులేక మాట్లాడుతున్నావు. కనపడుతోందిగా మీ బ్రతుకు.

బస – నీలాంటి భ్రష్టులుంటేసరి, ఎందుక్కనపడదు.

తాత – అదంతా అనవసరం, గారీ! అపహరించిన డబ్బేం చేశావు?

గారి – డబ్బును అపహరించింది నేనుకాదు.

తాత – (కోపంతో) ఎంతనంగనాచివే! నువుకాదేం! కాక పోతే యింకెవ్వరు! యిప్పటికైనా నిజంచెప్పి, నీతప్పు వొప్పుకొని క్షమాపణ కోరుకో.

బస – (విచారంగా) గౌరిని నిష్కారణంగా నిందిస్తున్నారు. పేదవాళ్ళమని అంతచులకనగా చూట్టం ధర్మంకాదు గౌరి మనస్సు గ్రహించండి నామాట విని దాసీదని దగాచేయకండి.

సుగు – దాసీదికాదు మా అందరిపాలిట దరిద్రదేవత... నాగన్నని మరిగి మమ్మల్ని వంచించాలని చూసిన విశ్వాసఘాతకి.

బస – (సూన్యంగా చూస్తూ) సుగుణమ్మగారూ!

సూ – ఏడిశావ్ కాని, కాలయాపన చేయక యిల్లు ఖాళీ చేయండి.

బస – యింత అర్ధరాత్రివేళఎక్కడికి పోమ్మంటారు.

తాత – గౌరి నువ్వూకలసి కట్టకట్టుకొని గోదావరిలోదూకండి

బస – (గౌరిని చూస్తూ విచారంగా గౌరి!)

గౌరి – నాన్న... (తెల్లబోయిచూస్తూ) నిజాన్ని గ్రహించరే నామీద నిందవేసి అపనిందపాలుచేస్తున్నారు. .డబ్బు అనేది విచిత్రమైన వస్తువు. పేదలపాలిట పెనుభూతం అపహరించేదొకళ్లు! అనుభవించేదొకళ్ళు!

తాత – అయితే నాగన్నేవచ్చి అపహరించాడంటావా!

గౌరి – ఆసంగతి నాకు తెలియదు.

సూ – పోని నాగన్నంటే ఎవరో తెల్సా!

గౌరి — (తలూపుతూ) తెల్సును.
సూ — వాడికి నీకుకల బాంధవ్యం!
గౌరి — ఏమీలేదు...
బస — వాడు మూర్తికి కుడిభుజం ... వాడితో ఎప్పుడూ తలెత్తి మాట్లాడెరుగడు.
సూ | (హేళనగా) ఒహో, తలవంచుకు మాట్లాడిందా! మరి చెప్పవేం?
గౌరి — లేదు...యింతమందిలో వొక అబలని అక్రమంగా నేరస్తురాల్ని చేసి పరాభవిస్తున్నారు.
సూ— ఇంకా యెందుకు చెప్తావులే! అంతా తేటతెల్లమయిం దిగా. (సుగుణమ్మని సమీపించి) యిప్పటికైనా అర్థ మౌతోందా? పరువుతక్కువ సాంప్రదాయంతో సంబంధం వద్దమ్మంటే విన్నావా? యిప్పుడు . .చూడు పిన్నీ, యిప్పుడైనా నామాటవిని ఈ పీనుగుల్ని వెంటనే ఇంట్లోనుంచి తరిమెయ్ ... మనపీడ వదలిపోతుంది . . బ్రతికి బయట పడతాం
బస — (సుగుణమ్మ కాళ్ళుపుచ్చుకొని) అమ్మ ... మీరే తల్లిగాభావించి మీనీడని బ్రతుకుతోంది నాగౌరి... తల్లినీడన బ్రతికే అమాయకురాల్ని చూసి సహించని చవటలు ఎవరో తంపులుపెట్టారని తరిమెయ్యటం ధర్మంకాదు. చేంకోరింది కోరినట్లు మీరేయిచ్చిఆద రిస్తుంటే, దొంతనం చెయ్యాల్సినపని దాని కేందు కుంటుంది? గౌరిని ఆనాటి గ్రహించలేకపోతున్నారా!

సూ — గ్రహించ కేం! యిందాకనే గ్రహించాము రం..కు. మగ...డి .కోసమని—

గౌరి - (కోపంగా) నోర్ముయ్, యిదంతా మమ్మల్ని అవ. మానించాలని వచ్చిన పన్నాగం. నాగన్నంటే యిరుగుపొరుగు వ్యక్తి మూర్తిచేతులో కీలుబొమ్మ డబ్బు అనే మహామ్మారికోసం ఏంచేయటానికైనా వెరవని వక్రబుద్ధి. యెదుటివాళ్ళ మానాభిమానాల్ని వంటకలపాలని అర్రులుజాచే అప్రయోజకుడు, అలాంటి నీచుణ్ని క్షమించి, ఆ దౌర్భాగ్యునికోసం యీ దొంగతనం చేశానని నిష్కారణంగా నేరాన్ని మోపటం అవమానకరం (సుగుణమ్మతో) అమ్మా! ఆడదాని మనస్సు ఆడది గ్రహింనట్లు మగవాళ్ళు గ్రహించలేరు నామాటలు విశ్వసించండి ప్రమాణంచేసి చెప్తాను. నిజం తెలుసుకోలేక నామీద...

సూ — అగ్గిలాగ భగ్గుమంటున్నారా ! (వికటంగా నవ్వి వెనక్కి లాగుతాడు)

సుగు - అంతా తెల్సుకున్నాను, యిలాంటివాళ్ళని తెలుస్తే యింట్లో అడుగు పెట్టనిచ్చేదాన్నే కాదు. ఆనాడే గెంటేదాన్ని, తెలియక మోసపోయానని చింతిస్తూ నాగౌరవానికి నేనే చిచ్చుపెట్టుకున్నానని ఏడుస్తున్నాను. నిజంగానువ్వే పాపం ఎరక్కపోతే అర్ధరాత్రివేళ అయిదువందలూ వాడికెలా వెళ్ళాయి.

గౌరి —(నీరసంగా) ఆ! నన్నింకా నమ్మటంల్లేదా!

బస — ఆవేశంతో) ఎవ్వరిద్వారాపంపింది, ఎవరు చెప్పారు?

సూ — (నవ్వి) అదికూడ చెప్పనా? నాగన్న ముత్తవతల్లి
ముసలిముండద్వారా, ఈసంగతిబయట పెట్టింది మనం
[తన్నిచూపించుకుంటూ ప్రక్కన వ్రేలాడుతున్న
తాడు తీస్తాడు]

బస — అంతామోసం వట్టిది .. కల్మషంలో పన్నిన కుట్ర

సూ — (వికటంగా నవ్వి. భీకరంగా చూస్తూగౌరినిసమీపిస్తూ
వుంటాడు) వట్టిదో, గట్టిదో, వినిపిస్తానుండు. (గౌరిని
సమీపించి) నిజంచెప్పు—దెబ్బకి దేవేంద్రుడు జడు
స్తాడు (నవ్వి) మాట్లాడవేం? దొంగముండా (విసురుగా
కొడ్తాడు. గౌరి కెవ్వున కేక వేస్తుంది. లేసి వోపికతో
బసవయ్య సూర్యానికిఅడ్డువెళ్ళిచొక్కాపట్టుకుంటాడు.

బస — (పెద్దగా) ఆగు నువ్వుమనిషివేనా? ఎందుకాపసికూన
నలా కొడ్తావు? నీ చేష్టల్ని బట్టిచూస్తే యిదంతా నీవే
కల్పించిన కట్టుకథగావుంది. తల్లిపాలు త్రాగి తల్లి
రొమ్ముని గుద్దురకంకాదు. [నెమ్మదిగానీరసంతో]
నిజం చెప్పు గౌరిదొంగతనంచేస్తూండగానువ్వుచూశా
వా(స్థాయిపెంచి) చెప్పవేం? నాగౌరి దొంగతనం
చేస్తుండగా నువ్వుచూశావా? (గొంతు చించుకుంటూ
చొక్కాపట్టుకు గుంజుతూ) మాట్లాడవేం? నాగౌరి
దొంగతనంచేస్తుండగా నువ్వుచూశావా? (విడిచిపెట్టి
రొప్పుతూ తూలిపోతాడు)

సూ — (క్రిందికి త్రోసి) దొంగని దొంగంటేవురిమురిమి మీద

కొస్తున్నాడు. ముండాకొడుకు (సుగుణమ్మతో) వీన్ని జాగుచేస్తేలాభంలేదు. వాళ్ళని ఇంట్లోనుంచి తక్షణం బయటకు గెంటు. లేదాఅరెస్టు చేయించు. రెంటిలోనూ ఏదోవొకటి వెంటనే చేయించు.

సుగు — (విసుగ్గా) సూర్యం...ఆ పనేదో మీరేచేయండి.

బస — (మాట్లాడలేక మాట్లాడుతూ బాధగా) మహాభిమా నాలు మంటకలిశాక నేను బతికిమాత్రం ఎవర్ని ఉద్ధరి స్తాను. ఆనాడు ఆవేశించినఅమ్మవారుతీసుకుపోయినా నాకీకష్టం వుండేది కాదు... కన్నకూతురికష్టాలుచూసి కుళ్ళిపోటానికే యింకా యీ భూమిమీదున్నాను. (నెమ్మదిగా) అమ్మా... గౌరి!

గౌరి — (ఏడుస్తూ) నాన్నా! (సమీపిస్తుంది)

బస — (బుజ్జగిస్తూ నెమ్మదిగా) భయపడకమ్మ! తానొకటి తలిస్తే దైవమొకటి తల్చింది. కూర్చున్నపీట తీసుకు న్నారని కృంగిపోకు. ..కష్టాలు ఓర్వలేక పొరపాటు నన్నా భగవంతుణ్ని తప్పుపట్టమాటనకు.. భగవంతుడు అందర్నీ వొకే మాదిరిగా సృష్టించడు. కల్మషహృద యాల కారుకూతలే మన సుఖాన్ని మట్టిపాలుచేసి మన్నికాడికి తెచ్చాయి. మీఅమ్మపోయినప్పటినుంచి ఇప్పటివరకు నిన్ను కడుపులో పెట్టుకొని పెంచుతు న్నాను. నాఆశ అక్కడే ఆగిపోయింది. (బాధగా) యిదే నాజీవితానికి అంతమదినం. చాలాదుర్మార్గంగా నడుస్తోంది.

గౌరి — నాన్నా (కౌగలించుకుంటుంది)

బస — (తలనిమురుస్తూ) ఆ రుణంకూడా తీరి... యింది. నిన్ను ఏకాకినిచేసి ఈవిశాల ప్రపంచంలో విడిచి...తున్నాను.

గౌరి — (భయంగా చూస్తూ) నాన్నా!

బస - (బాధగామాట్లాడలేక మాట్లాడుతూ) నాన్నకీ నీకూ రుణం తీరిపోయింది. నీవట్లు సత్యం జయించితీరుతుంది యిదే నా అంతిమ దీవెన ప్రతుకు...ద విరక్తితో ఆత్మహత్య మాత్రం చేసుకోకు తల్లి! [నెమ్మదిగా] ఆ . .త్మ . . .హ. . .త్య. . .చే. సు కో .కు. త. ల్లి (మరణిస్తాడు)

గౌరి - (పొంగివచ్చేదుఃఖంతో పెద్దగా] నాన్నా! (మీదపడి ఏడుస్తుంది)

సుగు — ఆఁ! (ఆదుర్దాగా గౌరి బసవయ్యని చూసి విచారం తో నిష్క్రమించును]

సూ — [తాతతో] ఆసలే నీరసంగావున్నాడుకదూ, మూర్ఛ పోయుంటాడు.

గౌరి - (ఏడుస్తూ) నాన్నా! నన్ను లోకంలో ఏకాకిని చేసి పోయావా? చిన్నతనంలోనే తల్లినిపోగొట్టుకొని,ప్రే మించిన ప్రియుసిదృష్టిలో దొంగగా మారి, దూరమై చివరకు నిన్నుకూడా కల్మషపూరితుల కారుకూతలకి కానుకగా సమర్పించిన యీ పాపిష్టురాల్ని యింకే ఆదరించి చేరదీసేవాళ్ళెవరు? అన్యాయానికి ఆలవాల మైన యీ పాపిష్టిలోకంలో ఆడవాళ్ళు, అందులో

నాలాంటి అబలలు అదృశ్యం కావలసిందేనా? న్యాయం, ధర్మం నీతి నామరూపాలు లేకుండా నాశనమైన ఈరోజుల్లో నాలాంటి పేదపడుచుల గతేంకావాలి ! పరువు లేక పాపాన్ని యిచుకించుకు పారిపోవలసిందేనా ! నాన్నా—నాగతేంగాను. [మీదపడి ఏడుస్తుంది]

సూ – తాతా! (ఆలోచిస్తూ) యింతకీ బసవయ్య బ్రతికున్నాడంటావా. చచ్చాడంటావా !

తాత – [నవ్వి) ఇంకెక్కడి బసవయ్య ! వాడెప్పుడో చచ్చాడు పట్టు—యీడ్చి పారేద్దాం

సూ – దగ్గరకెళ్ళి నాడిచూడు. ఎటోచ్చి ఎటుపోయినామంచిది

తాత – ఇంకాఅనుమానమే! (పరిశీలించి) నేను చెప్పలేదూ? అంతే !

సూ (భయంతోగుడ్లుతేలేస్తూ) ఆ ! చచ్చిపోయాడా? (వణికిపోతాడు)

తాత (నవ్వి) వాడు చస్తే నీకు భయమేమిటి?

సూ (భయంగా) కాదు బలవంతంగా చచ్చినవాళ్ళు దెయ్యాలై పీక్కు తింటారంటారు. అదీనాభయం (నెమ్మదిగా చూడు. నరుని కంటపడకుండా వాణ్ని బయటికీడ్చెయ్యాలి, లేకపోతే మనపనీ తర్వాత యింతే ! (బసవయ్యని చూపిస్తాడు) ఎందుకంటున్నానంటే యీపని మనం చేశామని మన్ని పట్టుకుపోతారు.

తాత – పిచ్చివాడ ! మనల్నెందుకు పట్టుకుపోతారు ? ఆఖరికి యింటి వాళ్ళే యేదో చేసివుంటారనే అనుమానముతో చంద్రాన్ని పట్టుకుపోతారు.

సూ - అదేమిటయ్యా! వాళ్ళు పెద్దవాళ్ళు, డబ్బుగలవాళ్ళు
తాత - అయితే,
సూ - అయితేయీపని వాళ్ళేచేశారని మన్ని చూపిస్తారు.
తాత - నమ్మొద్దూ!
సూ - ఎందుకు నమ్మరు బసవయ్యాకీ వాళ్ళకి ఎంత జోస్తీ వుందో అందరికీ తెలిసిన విషయమే! అందుకని ఈపని మనమే చేశామంటాగు. మధ్య మనం యిరుక్కుని చావాల్సిందే! వాళ్ళా కలిగినవాళ్ళు! అవసరమైతే పదిమందికీ పదొందలు పారేశన్నా అలా చెప్పిస్తారు. తీసుకోరంటావా! మనవాళ్ళందరికీ అలవాటే, (నెమ్మదిగా) అందరిసంగతీ అలావుంచు మనంచేసినపనేమిటి? లంచానికాసించే యీపనిచేసింది. (కొంచెం పెద్దగా) అందుకే యీడ్చి బయటిపారేద్దాం. తెల్లవారేసరికి నడివిదిలో కనిపిస్తాడు. మనమీదికేమీ రాకుండా బయటివాళ్ళెవరో చంపిపారేశారనుకుంటారు.

తాత - (నెమ్మదిగా] గౌరిముండ చెప్పదూ
సూ - అయితే ముందు దాన్నే యీడ్చిపారేద్దాం. తరావాత నెమ్మదిగావచ్చి వాణ్ని పట్టి పక్కవీథిలో పారేద్దాం. తెల్లవారగనే ఏమునిసిపిటీవాళ్ళో కాటికిఈడుస్తారు.
తాత - అయితే సరె, పట్టు.
సు - పద(గౌరిని సమీపించి) ఏయ్ ముండా! నిండినింట్లో నీ గోలేమిటి? పోలీసువాళ్ళ కంటపడకుండా పారిపో లేకపోతే దొంగపనిపట్టుకుంటారు,

గౌరి — (ఏడుస్తూ) ఎవర్ని పట్టుకునేది? ఎవరు దొంగ ? మా నాన్నని అన్యాయంగా పొట్టనెట్టుకుని యీ పాడుపని చేస్తారా? యిదేనా ధర్మం.

సూ - (భయంగా అటూ యిటూ చూస్తూ) అయ్యబాబో యెవరన్నా వింటారు. చూస్తావేమిటయ్యా నోరు నుయ్యవయ్యా.

గౌరి - (పెద్దగా) ధర్మ, న్యాయం పాటించలేని మీలాంటి పశువుల్ని ... (తాత బలంగా నోరుమూస్తాడు. చెరొక రెక్క పట్టుకుని బయటకీడుస్తు వుంటారు.

గౌరి — (పెద్దగా) వదలండి నేను నిరపరాధిని, మానాన్నకీ నాకు యెడబాటు జేయకండి. నామాట వినండి అయ్యోసుగుణమ్మగారు, చంద్రంగారు, చంద్రం గారు (మళ్ళీ నోరుమూసి బలంగా యీడ్చుకుపో తారు. అనంతరం తిర్గివచ్చి పీనుగుని సాయంపట్టితీసుకు పోతారు, సుగుణమ్మ ప్రవేసించి అటూ యిటూ చూసింది, బయటనుంచి చంద్రం ప్రవేసిస్తాడు)

సుగు - వచ్చావా నాయనా! యీరోజుతో మనపీడ వదలి పోయింది. యిట్లోనుంచి గెంటిపారేశాం

చం — (ఆశ్చర్యంగా) పీడా? ఎవరు?

సూ - ఎవరేమిటా ? ఆగౌరిముండే? మనింటో వున్నట్లుగానే వుండి గుట్టు చప్పిడికాకుండా అయిదునందల రూపా యలు అపహరించింది.

చం - ఆఁ! ఏమిటి! నీమాటలు చాలవింతగా కనిపిస్తున్నాయి. గౌరి మనింట్లో అయిదువందల రూపాయలు అపహరించిందా ?

సుగు - అవున్నాయనా ! సూర్యంయీసంగతి చెప్పగానే నాకూ ఆశ్చర్యంవేసింది, తీరా చూద్దునుకదా...

చం - నిజమని నీకూ నిర్ధారణయిందా?

సుగు - (ఔను, అన్నట్లు తలూపుతుంది)

చం - ఈ సంగతి సూర్యానికి యెలా తెల్సును?

సుగు - వాడెవరో నాగన్నట, వాడికి నూటపంపుచుండగా స్వయంగా చూశాట్ట.

చం - వాడీసంగతి నాతో యెందుకు చెప్పలేదు?

సుగు - ఇప్పుడేగా నువ్వు వచ్చింది.

చం - వచ్చాను. పిడుగులాంటివార్త విన్నాను, నమ్మలేకుండా వున్నాను. నమ్మటానికి అవకాశం చిక్కటలేదు. గౌరి అ[illegible]టి ద్రోహానికి యెప్పుడూ పాల్పడదు.

సు - నీకు తెలియదు చంద్రం ! గౌరికి నాగన్నకి సంబంధం వుందిట

చం - ఆఁ! నిజమేనా ? (ఆలోచిస్తూవుంటాడు)

(తెరలో గౌరిమాటలు వినిపిస్తాయి. పేదపడుచుకోసం ప్రయాసపడి ప్రేమించి, పెళ్ళిచేసుకుంటే మీపరువు ప్రతిష్టలకే భంగం కల్గుతుంది. మాకు యీ తిండి కూడా లేకుండా అధోగతిపాలు కావాల్సివస్తుంది)

చం — అవును గౌరి ఆనాడే చెప్పింది. పేదవాళ్ళని చూసి ఓర్చలేని ధనికవర్గం యెలాంటి అవినీతికన్నా పాల్పడు తుందని, నిష్కారణంగా నాగౌరిని అనుమానించి యింట్లోనుంచి గెంటేశారు.

సు.గౌ - నామాటనమ్మరా! గౌరి రంకుముండ, దొంగది.

చం— (తెల్లబోయి పిచ్చిగాచూస్తు) గౌరి రంకుది, దొంగది (పిచ్చిగా పెద్దనవ్వు నవ్వి) గౌరి దొంగది. రంకుది (మళ్ళీనవ్వి) యింటోనుంచి వెళ్ళగొట్టారు. యెక్కడికి పోయిందో, నాకోసం ఏవిధంగాకుళ్ళికుళ్ళిఏడుస్తోందో. అమ్మా! ఆలోచించకుండా నాజీవితాన్ని అంధకారం చేశావు. నీవు మనిషివికాదు. గౌరిని నేను పెళ్ళాడ టం యిష్టంలేదని ఆనాడే చెప్పావు. కాని కష్టంమీద వప్పుకున్నావు. నాదగ్గర యింతకాలంగా కపటంగా నటిస్తూ యిప్పుడు నీవుద్దేశాన్ని బలపర్చుకోటానికి బయల్దేరావు.

సు — పోనీ నామాటంటే నీకు నమ్మకంలేకపోతేసూర్యాన్ని.

చం — వాడోక చవట. నేను గౌరిని పెళ్ళాటం వాడికిమాత్రం యిష్టంవుందా? యిప్పుడే వెళతాను, నిజం తెల్సుకుం టాను. నాగౌరి యెక్కడున్నాసరే, తీసుకొస్తాను. నా గౌరి నాకు దక్కకపోతే మిమ్మల్నందర్ని బలినరుకు తాను.(వెళ్ళబోతాడు)

సు - [గట్టిగాపట్టుకొని] వద్దు, నామాటవిను

చం - (వదిలించుకొని) ఇంతవరకు మీమాటలు విన్నాను కాబట్టే యీ విధంగా తయారయ్యాను. ఈ యింటో గారిలేందే వక్క నిమిషముండను. యెక్కడున్నా సరే దాన్ని వెతికి మరీతీసుకొస్తాను లేదా కారుకూతలతో కలవరపెట్టే కష్టజీవుల కఠిన హృదయాల్లో మీ ప్రాణాల్ని నా ప్రాణాల్ని అంకితం చేస్తాను, వస్తాను. (చర చరా వెళతాడు)

సు - (పెద్దగా) చం దం! (పడిపోతుంది. అనంతరం తాత, సూర్యం ప్రవేసిస్తారు)

తాత - మనపీడవదిలిపోయింది.

సు - (పెద్దగా) బాబాయి! చెంద్రం వెళ్ళిపోయాడు. ఎక్కడికో తెలియదు. మతి చెడిపోయిఅర్ధరాత్రిఎక్కడికో వెళ్లిపోతున్నాడు! వెళ్లండి! వాణ్ణితీసుకురండి బాబాయి నాకు పుత్రభిక్ష పెట్టు (మూర్ఛపోతుంది)

తాత - (గాభరాగా సుగుణమ్మను పరిశీలించి) ప్రాణభయం కల్గలేదు. వుదయాన ఏడాక్టరుకో చూపిద్దాం నేనువెళ్లి చెంద్రన్ని తీసుకొస్తాను. సుగుణమ్మనిజాగ్రత్తగా కాపాడుతువుండు (చెర చెర వెళ్తాడు)

సూ - (భయంగా అటూ యిటూ చూస్తూ) చివరికిదంతానా చావు కొచ్చినట్టుందే. అర్ధరాత్రి పీనుగుపోయినింటో బిక్ బిక్ మంటూ వంటరిగా నాకీశిక్షేమిటి? వాడిసంగ తెలాగున్నా నా పని అయ్యేటట్లుంది. సమయం చూసుకొని వచ్చిన బసవయ్య దెయ్యమైవచ్చిపీక్క

తిన్నాది ఠక్కు లేదు. యిప్పుడేమి చేయను ? (తెరలో కుక్కలు మొరుగుతున్నాయి) అయింది (గుడ్లుమిటకరిస్తూ) నాపనిఐంది. గారిముండపోలీసువాళ్లనోజొగ్గలోన్నా పంపుతోంది. (ధైర్యం తెచ్చుకుంటూ) ఛా ఛా ఛా ఏదో పిరికిగా అంటానే కాని (అటూ యిటూ చూసి) ఏమోలే, కాలం సమ్మతగింది కాదు కత్తుత్తో ఏపనన్నా చేస్తారు (మళ్లీ కుక్కలు మొరుగుతున్నాయి) ఆ! యీమాటు బాగా మొరుగుతున్నాయి. ఏదో అలికిడి లేకపోతే అవ్వెందుకు మొరుగుతాయి. వచ్చింది ! నా రోజూ వచ్చిందిరా నాయనా? (గుండెబాదుకుంటూ) తాత ముండాకొడుకు నాకు మర్మంపెట్టి మాయమయ్యాడురా! చివరకి పట్టుపడేది నేను ! యే దెయ్యం పట్టుకున్నా నన్నే... ఏమిటి గత్యంతరం (ఆలోచించి) ఆ బలేవుపాయం తట్టింది. (గబగబా వెళ్లి అక్కడున్న మంచం నడుంగా కూర్చుని, కళ్లుమూసుకొని ఆంజనేయ దండకం చదువుతూ వుంటాడు)

[తె ర]

# పే ద ప డు చు

## ఆ ర వ రం గం

[స్థలం : బజారు. [ప్రజలు అటూ యిటూ నడుస్తూ

వుంటారు. గౌరి దిగులుతో నడవలేక నడవలేక నడుస్తు వుంటుంది. ముష్టివాడు పాటపాడుతూ (ప్రవేశిస్తాడు) కనరా... ... ...

పేదల జీవిత — బాధను వినరా ॥కన॥
మర్మము విడిచి - మా ఖర్మము చూసి
ధర్మము చేయుచు - దరికి జేర్చగా ॥కన॥
ఆవరించిన — ఆకలి బాధతో
అలమటించే - అంధజీవులకు
అన్నము పెట్టి - ఆదరించగా మా
పేదల జీవిత — బాదను వినరా ॥కన॥
భోగాలతో — కులికే మీరు
ఆకలితో — అంత మొండే
బీదల ఆకలి - తీర్చగ కనరా
పేదల జీవిత — బాధను వినరా ॥కన॥

(నిష్క్రమిస్తాడు)

గౌరి-(విచారంగా) లోకం ... పాపిష్టి లోకం...యెదుటివాళ్ల సుఖాన్ని చూసి ఓర్వలేక కళ్లల్లో కారం పెట్టుకునే కాలంలో యీ దౌర్భాగ్యురాలి మొర విని జాలిపడే దయామయులెవరు! రక్తాన్ని చెమటగామార్చికష్టపడి కూలిచేసికడుపులోపెట్టుకు పెంచి పెద్దచేసినతండ్రినిపోగొట్టుకొని, దిక్కులేని పక్షిలాగ అల్లాడిపోవలసిందేనా! నన్ను కనికరించి, నా మొర వినే కరుణాహృదయులు కరువైన ఈ పాపిష్టిలోకంలో ఈ అభాగ్యురాల్ని

ఆదరించి, నా నిర్దోషిత్వాన్ని నిరూపించేదాతలేలేరా? దిక్కు మొక్కు లేనివాళ్ల జీవితాలు నిరర్థకం... వాళ్లీ ప్రపంచంలో వుండటానికే అనర్హులు. వాళ్ల ఆదర్శానికి మార్గదర్శకంగా కనిపించేది చివరికి ఆత్మహత్యే! అంతకంటే వేరే మార్గం లేదు.

[తెరలో ఎన్నికష్టాలొచ్చినాఆత్మహత్యమాత్రం చేసుకోకుతల్లి! అన్నతండ్రిమాటలుగుర్తుచేయాలి]అవును నాన్న! నీమాట ప్రకారమే నడ్చుకుంటాను. నా నిర్దోషిత్వాన్ని నిరూపించి, నేను నిరపరాధనని లోకంలో ప్రతిధ్వనించేదాక నిద్రపోను... అందాకా నీ ఆత్మ శాంతి పొందదని నాకు తెల్సును ... అందుకోసం యిప్పుడు ప్రయత్నంచేస్తాను. [అంటూ వెళ్తుంది. తెరలో మళ్లీ భిక్షుకుని పాట వినబడుతుంది]

[చంద్రం పిచ్చివాడులా వెర్రిచూపులు చూస్తూ ప్రవేశిస్తాడు]

చం — (పిచ్చిగానవ్వి) ఆడది పురుషునిపాలిట శత్రువు... ఆడదాన్ని నమ్మి ఎంతమంది చెడిపోలేదు? అందులోనేనో కణ్ణి, ప్రేమించి పెండ్లి చేసుకుంటానంటే మోసం... పెళ్ళికిబదులు నడివీధిలోనవ్వులపాలవటం... మనస్సుకి మనస్సు జతపర్చి, తీయనిమాటల్తోనా ప్రేమనుమలినం చేసి దొంగతనంచేసి నాగన్నకి డబ్బుపంపటం... ఆదరించి చేరదీసిన వాడి బ్రతుకు బజారుపాలు చేయటం, యిది యీ రోజుల్లో జరిగే వింతనాటకం... న్యాయానికి యివి రోజులుకావు. మానాభిమానాలుమంటకలి

కొక బ్రతికి ప్రయోజనమేముంది! అలాంటిఆడదాన్ని పంచేస్తే పాపముంది! [వెర్రిగానవ్వి] వొక పురుషునికి ఒక భార్య... ఒక ఆడదానికి ఒక భర్త... అంటారే కాని ఆదరించే అంధులెవరన్నా వున్నారా! ఎందుకం టారు!... నాగన్నని మరిగిన గారి యీ సగంతి యిది వరకే చెప్పకూడదూ!

ఆత్మ — (తెరలో) అక్కడే పొరబడుతున్నావ్. పాపం అమా యాకురాలు. గారి ప్రేమ నిష్కళంకమైంది. చెప్పుడు మాటల్తో నీ పవిత్ర ప్రేమను బూడిదలో కలిపిపాడుచేసు కున్నావు... లోకం ఎదుటివాడి సుఖం జూసి వోర్వ లేని అప్రయోజకులతో నిండిపోయింది... ఆమె మన స్సును గ్రహించలేక ఆమె ప్రేమను పాడుచేసి పాప పంకిలంలో కీడుస్తున్నావు.

చం — (తెల్లబోయిచూస్తూ) ఏమిటి!

ఆత్మ — (తెరలో) అవును పేదపడుచు ప్రేమ పవిత్రమైంది (నవ్వి) పిచ్చివాడా! యిప్పటికైనా నిజం తెల్సుకో...

చం — (వికటంగా నవ్వి) తెల్సుకున్నాను, సర్వం తెల్సుకున్నా ను ... [పెద్దగానవ్వి పిచ్చిచూపులతో] ఆ పాపిష్టి రాల్ని చేరదీస్తే యింకా తెల్సుకుంటాను ...

(సూర్యం, తాత, నాగన్న, ప్రవేశిస్తారు. చంద్రంవాళ్ళని చూసి ప్రక్కకు తప్పుకొని వాళ్ళమాటలు వింటూవుం టాడు]

సూ — వద్దయ్యా అంటే విన్నావా ! అన్నివిధాల చెడ్డాం

మనం చెడ్డాం !...చంద్రం చెడ్డాడు. మనోవ్యాధితో
మంచం యెక్కి సుగుణమ్మ చెడింది అంతే.

సూ—అంతెలే—మన కేదన్నా మాటవళ్ళొపడ్డట్టయితే వాళ్లు
చెడ్డారనే దిగులు నాకు లేకపోయేది. పని అయ్యేదాక
యిస్తానన్నాడు. పనయ్యాక పది రూపాయలు మన
మొహాన పడేశాడు.

నాగ—యిదిగో ఆలిముండా మొయ్యా! నాకుమాత్రంయిచ్చాడా!
గౌరమ్మకీ మూర్తికీ పెళ్ళికాగానే మనందరికీ పండగే!
ఆనాడు— ఆలిముండామయ్యా—మనమేగా పెళ్లిపెద్దలం.
(మీసం మెలేస్తాడు)

సూ ఆ! అవుతుంది అర్ధాన్నం—వాడి పేరు చెప్తేనే అది
వుచ్చేస్తుంటే-యింకా అయ్యేదేమిటి-వుద్ధరి.

నాగ—అవుతుందో లేదో నీకు తెల్సా! హు నాగన్నంటే,
మామూలు మనిశనుకున్నావా! యింటో యించిఎల్లి
గొట్టేవుపాయం మీరా రాలోచించారు .. ఎల్లగొట్టిం
చారు. మనం (సకిలించి) అది మెల్లేవార్లో కల్పుకొని
మాయపన్ని మంచిమాటలు చెప్పి మూర్తిగారింటికి
తీసుకెళ్ళి దింపాను యింటుంటాశాంగుకషుద్ధి, లేకపోతే-
ఆలిముండా మొయ్యా (గుడ్లు తేలేసి) యింతే.

సూ – అవునుకదా! అది అంతే. మనం యింతేగా.

తాత – అంటే !

సూ - అర్ధాన్నం...నువు వెయ్యిచెప్పు, లక్ష చెప్పు, అను
కున్నకాడికి నా మూడువందలూ నా చేతిలో గుయ్యె

రించక పోయినా యీ సంగతంతా చంద్రంతో చెప్పి మీాపని పట్టిస్తాను.

తాత —(నవ్వి) యింకా వాడెక్కడున్నాడు ... పౌరుషంకోసం వాడెప్పుడో బలవంతాన చచ్చిపోయుంటాడు.

నాగ —ఆడిసంగతలావుంచు—మూర్తిపట్టుదలంటే ఏటో అను కుంటున్నావు యెన్ని కూనీలు చేశాడో తెల్సా. ఆలి ముండా మొయ్య! ఆయనకది ఆట! కిందుంటుంది—మొది లినా, యీగుట్టు యితర్ల చెవిలో వేసినా—ముందు నీ ప్రాణాలకే ముప్పం.

సూ - నా ప్రాణంపోయినా సంతోషమే! ఫలితం లేకపోయినా స్నేహితుణ్ణికూడ పాడుచేస్తాననుకున్నావా? తాతా! నే నక్కడికిరాను యింటికి పోతున్నాను. దీపం పెట్టే లోపుగా మనడబ్బు మనకి తెచ్చిఇవ్వకపో [సకిలిస్తాడు] (చెంద్రం వికటగా నవ్వుతూ, పిచ్చివాడులా ప్రవేశి స్తాడు. తాత, సూర్యం, నాగన్న గాబరాపడి పారిపో బోతారా)

చం - (పెద్దగా) సూర్యం! (పట్టుకుంటాడు సూర్యం వణికిపో తాడు. తాత, నాగన్నలు పారిపోతారు)

సూ - (మాటతడబడుతూ) అ అ అ నీకోసమే వెదుకుతున్నా పిన్ని వెతుక్కురమ్మంది (సైడికి తిరిగి) తాత! చంద్రం యిక్కడున్నాడని సుగుణమ్మతో చెప్పు.

చం—విన్నాను! అంతా విన్నాను, గారెక్కడ?

సూ - నాకేం తెల్సు!

చ — నీకు తెల్సునని నాకు తెలిసందిలే (ఉరిమిచూస్తూ) చెప్పు లేకపోతే నీకంఠం పిసికిచంపుతాను.

సూ — నేను నీ స్నేహితుణ్ని.

చం — అవును నమ్మాను. మోసపోయాను నీలాంటి మిత్ర ద్రోహిని నిలోబెట్టి కాల్చాలి. (నవ్వి) పిల్లి పాలు త్రాగుతూ ఎవ్వరూ చూళ్ళేదనుకుంటుందిట. నీ కుట్రంతా విన్నాను నిజం తెల్సుకున్నాను యిప్పటి కైనా నిజం చెప్పకపోతే నీప్రాణాలు నీకుదక్కవు.నా గారి ఎక్కడ? ప్రాణానికి ప్రాణమిచ్చి మెలిగే ప్రాణ స్నేహితుడని విశ్వసించాను గాని యిల్లాంటివాడివని తెలుస్తేఆరోజేనిన్ను మాయింటిచాయలకు రానిచ్చే వాణ్ని కాదు. నన్ను చూస్తే నీకీ కడుపుమంటెందుకు ! నేను నీకు జేసిన ద్రోహమేమిటి? నువ్వు మనిషివికాదు. పశువ్వీ కాదు అంతకండే అథముడివి. నీలాంటి వాజెమ్మలు వున్నంతకాలం ప్రపంచలో అనాచా కాలు ప్రబలమై అథోగతి పాలవ్వాలసిందే !

సూ — అదేమిట్రా. నన్నంటావేమిటి? ... నే నల్లాంటివాణ్నా నీకు తెలియదుట్రా? బాగుంది. చేసేదొకడు, అనుభ వించేదొకడు.

చం — ప్రేమజీవుల్ని విడదీసి యీపాపాని కొడిగట్టుకున్న దెవరు? (పెద్దగా) చెప్పు.

సూ — చెంద్రం! నన్నెందుకు చంపుతావ్? నేనేపాపంఎరుగను యిదంతా కాతయ్యగాడు చేసాడు. వెళ్ళి ఆయన్ని

అడుగు! అన్నివివరాలు తెలుస్తాయి.

చం - సూర్యం! నాగారి ఎక్కడుందో నీకు తెల్సును. యింకా నన్ను సాదించాలని ప్రయత్నిస్తున్నావు నిజంచెప్పు (చొక్కాపట్టుకొని) లేకపోతే యిప్పుడే చంపేస్తాను. (పెద్దగా) చెప్పు.

సూ - (కాళ్లుపుచ్చుకొని) చంద్రం తమించు గారిని మనం యింట్లోంచి వెళ్ళగొట్టాక నాగన్న వెంటబెట్టుకొని తీసుకుపోతుండగా మాత్రం నేను చూశాను. అంత కంటే నాకేం తెలియదు, నామాట నమ్మ.

చం _నమ్మతగ్గ అవకాశంలేదు. పోనీ ఎక్కడకుతీసికెళ్ళాడో చెప్పు.

సూ _ అవేళ మూర్తియింట్లోపెట్టి తాళం వేశారు ... తర్వాత యేంచేశారో నే నెరుగను.

చం_ఆ!(తన్ని) మూర్ఖుడా, నిన్నేంచేస్తేపాపముంది? యిప్పటి కైనా నీతప్పు నువ్వు తెల్సుకో. స్నేహితుడవనిక్షమించాను కాని, గారి నాకు దక్కకపోతే మీ అంతు తేల్చుకు వదుల్తానని మర్చిపోకండి. (చరచర వెళ్తాడు)

సూ _ (నెమ్మదిగా లేస్తూ) భగవతుని దయాంటూ, ప్రాణంతో వదిలిపెట్టాడు. లేకపోతే నాపని అయిపోయేదే యిప్పుడు నాపని ఏమవుతుందో నాకే తెలియటల్లేదు, చెప్పకపోతేవీడిచేతిలో చచ్చేవాణ్ని చెప్తేవాడిచేతిలో చావాలి. మధ్యమనకి చావుతప్పదు (ఆలోచించి) ఆ! మంచివుపాయమే తట్టింది, వెంటనే వెళ్ళి మూర్తికి

వాణ్ని గురించి అబద్ధాలు చెప్పాలంటే మనమీద అనుమాన ముండదు. లేకపోతే మనపనిక్లోజ్. (చెర చెరా వెళ్తాడు)

[తెర]

# ఏడ వ రంగం

(స్థలం: మూర్తి రహస్యగృహం. సమయం. సాయంత్రం ౬ గంటలు ప్రాంతము. ఓకకుర్చి, దాని ప్రక్క నోక టేబులు, దానిమీద పడగవిప్పినపాము బొమ్మకాని నోరు తెరచిన పులి బొమ్మకాని వుంటుంది, గోడకుమూర్తి ఫోటో తగిలించివుంటుంది. తెర నెమ్మదిగా యెత్తబడుతుంది. గౌరి విచారంగా పాడుతూ వుంటుంది.)

గౌరి — గాలిలో నా బ్రతుకు
తేలిపోతుందేమొ
నా బ్రతుకు భారమై
బరువాయెనా ధరికి ॥గాలి॥
ఏ దారి పోతుందో
ఏమి కానుందో నాకు
ఎదురాయెనో నేడు
లోకమే నా విధికి ॥గాలి॥

కారుమబ్బులై నన్ను
అలుముకున్నా యే మొ
కటికి చీకటే న
న్ను ఆవరించునేమో ॥గాలి॥

(ఏడుస్తూ) ఇదేనా ధర్మం ? ఆడదంటే అంతచులకనై పోయిందా? అహంకారంతో కళ్ళు తెలియక కామం ఆవేశించిన అప్రయోజకుల దురహంకారానికి ఆడది- అందులో నాలాంటి బీదరాలు ఆహుతి కావలసిందేనా? డబ్బు అనే మహామ్మారిని పట్టి దాన్ని ఆరాధించి పూజించేవాళ్ళు పేదవాళ్ళపాలిట పెనుభూతాలై చెలరేగవలసిందేనా) పేదవాళ్ళంటే ఎందుకూ కొరగాని గడ్డిపూచకంటె కనాకష్టంగా చూసే ధనికుల దౌర్జన్యాలను అరికట్టలేని ప్రభుత్వం దేశానికేం సేవచెయ్యగల్గుతుంది? అందరూ సమంగా వుండాలని సంఘంలోనూ దేశంలోనూ కుళ్ళు కూలిపోవాలని గొంతుచించుకుంటూ వుపన్యాసాలిచ్చే ఘరానా పెద్దమనుష్యులకి నాలాంటి పేదపడుచు కష్టలు కనుపించటంల్లేదా ? పేదవాళ్ళ సుఖాన్ని చూసి సహించలేనిధనికులకు పేదవాళ్ళమీదా కడుపుమంటెందుకు? నా తండ్రికీ నాకూ దూరంచేసి, నిష్కారణంగా నామీద నేరాన్ని మోపి, నన్ను ఆదరించి చేరదీసిన నా ప్రియునికి నాకు ఎడబాటు కల్గజేసిన పరమనీచాగ్రేసర చక్రవర్తులకీ నే నేం ద్రోహం చేశాను.

మూర్తి — (నెమ్మదిగా ప్రవేశిస్తూ) హ్హాహ్హాహ్హా!... నీవు చేసున ద్రోహంనీకు తెలీదూ ... నీకు మేనమామనైన నన్ను ప్రేమించక పోవటమే నీవు చేసిన పెద్దద్రోహం ...

గౌరి - ఒక పేదపశుచుని భర్తనుండి దూరంజేయటం ..

మూర్తి — ధర్మంకాదు, కాని మొదట్నుంచీ నీ భర్తను నేనే నంటున్నానుగా!

గౌరి — ఆమాట నే ననుకోవద్దా! చంద్రాన్ని ప్రేమించి, ఆయన ప్రేమకునాజీవితాన్ని అంకితంచేశానే. ఆ కంటి తో నిన్నెలా చూస్తాను, అందుకని దయయుంచి యీ జన్మకి నా భర్త చంద్రమేనని మరువకు.

మూర్తి — (నవ్వి) అసంభవం! అలాజరుగదు చంద్ర నిన్ను ప్రేమించినమాట వస్తవమే. పెండ్లి చేసుకుంటానని మాటయిచ్చినదీ నిజమే. కాని రోజులు కలసిరాకపో వటం మూలాన వాళ్ళింట్లో నేరస్తురాల వయ్యావు. దాంతో వాడిప్రేమ యెండుకొమ్మలాగవిరిగిపోయింది. విరక్తి చెందిన ప్రేమకు విరుగుడు లేదు.

గౌరి — ఉంది ... నా నిర్దోషిత్వాన్ని నిరూపిస్తే ఎప్పటి కయినా ఫలితం వుంది. నీవు చేసినతంత్రం నాకు పూర్తిగా తెలిసింది. నామీద నిష్కారణంగా ఈ నేరాన్ని పడేయించింది నువ్వే! కామాంధకారం కళ్ళకి పొరలుగా కమ్మి, యీ కపటనాటకం ఆడించిన సూత్రధారుడవు నువ్వే (విచారంగా కంటికి రెప్పలా కన్న తల్లికంటే ఎక్కువగా కాపాడిన సుగుణమ్మగారి

కి నామీద లేని పోని సాకులు చెప్పించిందీ నువ్వే. నన్ను ఆదరించి నాకు అన్నంపెట్టిన ఆమె హృదయములో తుపాను లేవదీశావు ... ఛీ ... నీమొహం చూస్తేనే పాతకం చుట్టుకుంటుంది.

మూర్తి — (నవ్వి) నీకోపంతో నా హృదయం మరీ అదుర్దా పడుతోంది పడినసేరం పరితపిస్తే మాయదు. నీవునన్ను తిరస్కరించినా, తిట్టినా, ఏంచేసినాసరే, నేను నిన్ను వొక్కటేకోరుతున్నాను. అందుకేఈప్రయత్నాలన్ని

గౌరి — (ఈర్ష్యగా) ఏమిటీ?

మూర్తి — అర్థంకాలేదా అందాలభరిణా. నీ హృదయ పంజరంలో యీ మదనమోహన మూర్తిని శాశ్వతంగా బంధించుకోమని కోరుతున్నాను. యెన్నో అక్రమాలు చేసి సంపాదించిన యీఆస్థి అంతా నీదే. నన్ను,నా ఆస్థిని శాశ్వతంగా పరిపాలించు.

గౌరి — (కోపంతో) ఛీ! నీవు చేసిన పసువుతక్కవపన్లు నీచాతి నీచాలు,నలుగురు నోళ్లల్లోనూ నాట్యంచేస్తున్నాయి. యెంతమంది నీ దుష్ప్రవర్తన్ని చూసి క్రాంద్రించి నీ మొహాన వుమ్మేస్తున్నారో యిప్పటికైనా తెల్సుకోమని హెచ్చరిస్తున్నాను,

మూర్తి — నవ్వి) సంపూర్ణయౌవనాన్ని పొందికూడా సుఖానికి దూరమౌతున్నావు. చూడు! నీవు దూరమౌతున్న కొద్దీ నాలో ప్రేమ, అనుభవించాలనే ఆసక్తి యెక్కు

పోతున్నాయి. తొణికిసలాడే నీ సౌందర్యాన్ని చూసి పరితపిస్తూ అవకాశంకోసం యెదురుచూస్తూ ఆరాట పడుతున్నాను. రా... నన్ను ప్రేమించు...

గౌరి - (నవ్వి) నీవు చేసిన అత్యాచారాలాకి నిన్ను ప్రేమించాలా?

మూర్తి - పిచ్చిదానా! (నవ్వి)గతంనాస్తి జరిగినవన్నీమర్చిపో! మేనమామని, నీమంచి కోరేవాణ్ణి నన్నపార్థం చేసుకోక ప్రేమించి నాజీవిత రథానికి సారథిగా వుండు ఆనందంగా నాఆశను యీడేర్చు...ఆ ఆశతోనే ఎదురుచూస్తున్నాను!

గౌరి – ఎదురుచూసే నీ ఆశను అధఃపతనం చేసుకో నీ అత్యాచారాలు నా గుండెల్లో నిప్పులు చెరుగుతున్నాయి నా యౌవనాన్ని నిర్మూలనం చెయ్యాలనేదురాశతో ఎదురు చూస్తున్నావు.

మూర్తి – కాదు మనసారా ప్రేమించాను.

గౌరి – నీది పవిత్రప్రేమ కాదు. కామం తీర్చుకోడానికి కారణంగా వున్నన పన్నాగం.

మూర్తి – పరిహసిస్తున్నావా?

గౌరి – (ఆశ్చర్యంగా) నీతో పరిహాసమా!.. పరువుప్రతిష్టలు పాటించక పశువులాగ ప్రగల్భాలుకొట్టి పాపాలుబ్రద్దలుచేసుకోబోతున్నావని,అందుమూలంగా నా మనస్సు చంద్రదంనుండి వేరుకాదని గట్టిగా చెపుతున్నాను.

మూర్తి – (వికటంగానవ్వి) చంద్రదం! (విరగబడివికటంగానవ్వి

నమ్మినవాళ్ళని నాశనం చెయ్యటంలో నాఅంతనీచుడు లేడని, అలాంటి అవివేకుల్ని ఎప్పుడూ ఎలాంటి విప రీత విపత్కర, కష్ట, నష్ట, దుష్ట సమయాల్లోకూడా నమ్మకూడదనీ నీక్షేమంకోరి చెపుతున్నాను. చెప్పిన మాటలయందు లక్ష్యముంచి చెవిని పట్టించుకుంటే బాగుపడతావు.

గౌరి – నాబాగు నీకక్కర్లేదు దయయుంచి నోరుమూసుకొని కారుకూతలుకూయక కాలికి బుద్ధిచెప్పు... కాలయాపన చేస్తే...

మూర్తి – అకాలమరణం పొందుతానా!

గౌరి – అవును. ఆడదల్లే ఒకరికి తన పవిత్రప్రేమను అంకితం చేసి మరొక నీచుడికి శరీరాన్ని పినియోగించేటంతటి నీచురాలుకాదు.

మూర్తి – (వికటంగా నవ్వి) ఇలాడాంబికాలా కొట్టేవాళ్ళని ఎంతమందినో చూశాను. ఆడదానివి–అందులో నా క్కావలసిందానివి.నామాటకాదని కాల్దన్నకు నన్ను ప్రేమించి నా ప్రేమను ఆదరించు. అంతకంటె సుఖం లేదు. మర్యాదగా మాటవినక, కాలయాపనతో కాలం గడుపుతే నీకోరలు పిండుతాను (రెండడుగులు వేస్తాడు)

గౌరి – ఆగు! నా చంద్రం...

మూర్తి – [నవ్వి) నీచంద్రం! వెందుకాభ్రమ! నిన్ను కాదని కాలదన్నినవాడు తిరిగినీకాళ్ళుపట్టుకుంటాడనే అపోహ

నీ అమాయకత్వాన్ని నిరూపించి వెకిలిగా నవ్వు తోంది. అందని పండుకోసం ఆశపడి అజ్ఞాతంగా ప్రయత్నించి నన్నపార్థం చేసుకుంటున్నావు. రా! ఇప్పటికైనా రా! నాదానవై నన్ను సుఖపెట్టు.

గౌరి - నీ వెన్నన్నా చెప్పు. నా శరీరంలో శక్తులన్నీ నిన్ను చూసి అసహ్యించుకుంటున్నాయి. కసీసంనా నీడనన్నా ముట్టుకోవడానికి నీకుఅర్హత లేదు ప్రాణంపోయినాసరే అనందిస్తానుగాని, నీవశంమాత్రం కాను. ఇది నా నిశ్చయం. నా నిశ్చయాన్ని నీవుకాదుగదా! నిన్ను సృష్టించిన వాడుగూడా మార్చలేడు. దయయుంచి యిలాంటి దగాకోరు మాటల్లో...

మూర్తి - (పెద్దగా) గౌరీ! తీయనిమాటల్తో దగాచేసి దారి తప్పింది నీచంద్రం కాని, నేనుకాదు. కడసారిగా నిన్ను ప్రేమభిక్ష పెట్టమని ప్రార్థేయపడుతున్నాను. నా మాట కాదంటే నీ బ్రతుకు నామరూపాల్లేకుండా నిలు వునా నాశనమవుతుందని మాత్రం తెలుసుకో మర్యా దగా మాటవినకపోతే మట్టిపాలు చేస్తాను. చెప్పు

గౌరి — (నవ్వి) సిద్ధంగా వున్నాను, అంతేకాని, తాటాకుచప్పు డికి కుందేళ్ళు బెదరవని తెల్సుకో.

మూర్తి - (నవ్వి) వెర్రిదానా! ఎందుకాకోపం? నామాట వింటే నిన్ను విశ్వమోహినిగా తయారుచేసి పూడించి అరాధిస్తాను కడుపునిండా తిండి, కంటినిండా నిద్ర, చక్కటి సుఖం అనుభవించిఆనందిస్తావు. నిన్ను పూల

మందిరంలో పెట్టిఆరాధ్యదేవతగా పూజిస్తాను, నా యావజ్జీవమూ నీకు నీ ప్రేమకూ దాసుడుగావుంటాను, ఏమంటావు?

గౌరి - (కోపంగా) వచ్చినదారి తియ్యమంటాను. నీతప్పులు నీవుగ్రహించి క్షమార్పణ కోరుకుంటే బాగుంటుం దంటాను నీమొఖం నాకు చూపకుండా యిక్క ణ్నుంచి వెళ్ళమంటాను (పెద్దగా) వెళ్ళు!

మూర్తి — [వికటుగానవ్వి] వెళ్ళను... వెళ్ళటానికి మనస్సంగీ కరించటంలేదు. వెళ్ళలేకుండావున్నాను. తప్పనిసరిగా నాదానివి కావాలి.(ముందుకు నెమ్మదిగానడుస్తాడు)

గౌరి — (తెల్లబోయి చూస్తూ) అన్యాయం.

మూర్తి — లేదు. అదర్శం (నాగన్న, తాత నెమ్మది లోప లకు ప్రవేశించి చాటున నుంచిని మూర్తి మాటల్ని వింటూ అనందిస్తూవుంటారు)

గౌరి — ఇది నీకు తగదు—దిక్కులేని ఆడదాన్ని

మూర్తి — కనుకనే పెళ్ళిచేసుకుంటాను.[ముందుకు వెల్తాడు)

గౌరి — నీకిది అపజయం(వెనక్కు తగ్గుతుంది)

మూర్తి - జాగుచేస్తే అధేకల్గుతుందని చెప్తున్నాను.

గౌరి — (జాలిగా) మామయ్యా!

మూర్తి అవునుఆమరుక్షణమే నీనిర్దోషిత్వాన్ని నిరూపిస్తాను.

గౌరి - ఆ! (తెల్లపోయిచూస్తుంది)

మూర్తి — తలూపుతూ ఈర్ష్యగా)నామాటలు నీమనస్సుకీ ఎక్కకపోవటంమూలాన నేనాడినదిమాయానాటకం

గౌరి — అన్యాయం.

మూర్తి — అలివాటైంది హటాత్తుగా ఆగుతుందా?

గౌరి — అర్థమైంది. నీవు పన్నిన పద్మవ్యూహం పూర్తిగా అర్థమైంది. ఇప్పుడే యీనిజాన్ని నాల్గువీథులా వెల్లడిచేసి నా నిర్దోషిత్వాన్ని నిరూపించుకుంటాను నిన్నూ, నీ ఆశల్ని నిలువునా నీళ్ళపాలు చేస్తాను.

మూర్తి — బయటపడే మార్గం? (నవ్వి) గౌరీ! వాగటం మూలకంగా నోరునొప్పే కాని ఫలితం లేదు. పనికిమాలిన ప్రేలాపనతో ప్రయోజనం లేదు. [చెయ్యిపట్టుకుని భీకరంగా] ఏమంటావు? గౌరీ [చేయివిదుల్చుకొని మూర్తి చెంప మీద కొడ్తుంది. మూర్తిమండిపడుతూ వికటంగా నవ్వి బలాత్కరించబోతాడు. తాతా, నాగన్నలుఆనందపరవశులౌతూవుంటారు. గౌరి మూర్తి పైకిసమీపాన్నున్న కుండను బలంగా విసురుతుంది. కుండ పగులుతుంది, మూర్తి తప్పుకుంటాడు. ఇంతలోగౌరిపారిపోబోతుంది. గుమ్మానికి అడ్డగా తాతా నాగన్నలు వికటంగా నవ్వుతూ, నిల్చుంటారు]

మూర్తి — [కోపంగా ఆగు! ఆడుగు ముందుకు వేశావంటే నీప్రాణాలు నీకుదక్కవు. (నెమ్మదిగా నడుస్తు) ఇంతవరకూ నాకు అపజయమనేది లేదు. ఆమాట గుర్తుంచుకొని నా కోపానికి కానుకగా నీప్రేమను ప్రసాదించు [పెద్దగా] కాదంటే నిన్ను నాశనం చేస్తాను,

[ఇంకా పెద్దగా] ప్రాణాలమీద ఆశలేదంటే చెప్పు ఏమంటావ్ ... బాగా సమీపించి వురుముతూ చూస్తాడు)

గౌరి — ఆనందంగా ప్రాణాల్ని విడుస్తాను... ఊఁ..చూస్తావేం ప్రాణం తియ్యి.

మూర్తి - ఇంకా అదేమాట

గౌరి — ఎప్పుడూ వొకటేమాట

మూర్తి - (వికటంగా నవ్వి గౌరిని సమీపించబోతాడు)

చం – (ప్రవేశించి) అగు.మూర్తి చొక్కా పట్టుకుని గుంజుతూ ఆవేశంతో) హంతకుడా! ఇదేనా మర్యాద? ఇదేనా పెద్దమనిషితరహా! ఇలాంటి నీచపు బ్రతుకు బ్రతికే కన్నా చస్తే మంచిది. అమాయకురాలైన గౌరిమీద నీకెందుకింత కడుపుమంట? నిష్కారణంగా నేరారోపణ చేసి చివరకు బలాత్కరించటానికికూడ సిద్ధపడ్డావా పశువా? ఈవిధంగా యెన్నిసంసారాలు గంగపాలు చేసి నీ పొట్టనెట్టుకుంటావు? న్యాయం, నీతి, ధర్మం, నీవేకోశంలోనన్నా పాటిస్తున్నావా? ఛూ! యెందు కయ్యాఇలాంటి వెధవబ్రతుకు బ్రతుకుతావు(మూర్తి నాగన్నకిసైగచేస్తాడు. నాగన్న కర్రతో బలంగా చంద్రం తలపై కొడతాడు. తల పగిలి రక్తం కారు తుంది) అబ్బా!బాధ [పడిపోతాడు]

మూర్తి — (డ్రాయరులో రివాల్వరు నందుకొని చంద్రానికి గురిపెడతాడు) నాగన్నా! బలేపని చేశావురా!

గౌరి — (పెద్దగా) చంద్రం ! అని (సమీపించబోతుందీ(

మూర్తి — [పెద్దగా నిలు ... సమయం చక్కగా చిక్కింది చంద్రం ప్రాణాలతో రక్షింపబడాలనుకుంటేను వ్వనా దానవి కావాలి తక్షణం. లేకపోతే ఇద్దర్నీ ఒక్కసారిగా కాలుస్తాను.

సూ — [మతి చెడిపోయి పిచ్చిగా ఏడుస్తూ] బసవయ్యా, నా దగ్గరకు రాకు, నన్ను క్షమించు. నేను కాదు. నేను కాదు. [ప్రవేశించి వెనకకెనక్కు నడుస్తూ చంద్రన్ని త్రొక్కుతాడు. అనంతరం చంద్రమీదపడి పెద్దగా "చంద్రం" అని ఏడుస్తూ వుంటాడు. మూర్తి ఈవింత చూస్తువుంటాడు, గౌరి పిస్టల్ తీసుకోవాలనే ఆశతో మూర్తిచేతిని కరుస్తుంది. ఆ తొందర్లో మూర్తి పిస్టల్ పేలుస్తాడు. సూర్యానికి గాయం తగిలి బాధపడ్తుంటాడు. గౌరి బలంగా పిస్టల్ తీసుకుంటుంది, నాగన్న తాత, బెదరిపారిపోతారు !ఆదార్నే సబ్ యిన్స్పెక్టరు ఇద్దరు పోలీసుల్ని వెంటబెట్టుకొని ప్రవేశిస్తాడు. నాగన్న తాతల్కి సంకెళ్ళు వేస్తారు.)

గౌరి — (పెద్దగా) చంద్రం! (మీదపడి యేడుస్తుంది. పిస్టలు విడుస్తుంది)

యస్.ఐ. — (అక్కడ అందర్నీ ఆశ్చర్యంగా చూస్తుకొపంగా మూర్తి—ఎవరు?

మూర్తి — (గౌరి వంకవకసారిచూచి యస్.ఐ.తో) నేనే !

యస్.ఐ. — (నవ్వి) నువ్వా! చేసినపాపాలుచాలక ఇంకా దేన్ని

కోసం ప్రాకులాడుతున్నావు! [యింతలో సూర్యం మూలుగు వినబడుతుంది. ఆదుర్దాగాసూర్యన్నిసమీా పిస్తాడు. పోలీసు వెంటనే మూర్తి ప్రక్కన నిలబడి పట్టుకుంటాడు]

యస్.ఐ. — ఎవరు నాయనా నిన్ను కాల్చింది!

మూర్తి – (గౌరిని చూపిస్తూ) అది! గౌరి చంద్రాని కికట్టు కట్టినెమ్మదిగా లేవదీస్తూ వుంటుంది)

యస్.ఐ. – నువ్వు నోర్ముయ్.(సూర్యంతో) ఎవరునాయనా

సూ — (మాట్లాడలేక బాధగా) ము. రితి... ఊ... ఊ... ఊ...

యస్.ఐ. — ఏయ్ వైట్ హాండ్రెడ్ అండ్ ఫోర్ అతనిదగ్గర స్టేటుమెంటు తీసుకో (మూర్తినిసమీాపిస్తాడు) ఎందుకు కాల్చావు!పోలీసు అడుగుతున్నట్లు సూర్యం చెప్ప లేక చెప్తున్నట్లునటిస్తూవుండాలి).

మూర్తి – (నిర్లక్ష్యంగా) నేను కాదు.

యస్.ఐ — (చెంపమీద కొట్టి) కాద్చి పైగా నేను కాదంటా వేరా రాస్కెల్. చెప్పు చొక్కాపట్టుకు గుంజుతాడు)

మూర్తి — (మాట్లాడడు)

చం — (నెమ్మదిగా లేస్తూ) గౌరీ! (కౌగలించుకుంటుడు)

గౌరి — (పొంగిపోయినదుఃఖంతో) చంద్రం!

యస్.ఐ – చెప్పు! నువ్వేనా!

మూర్తి — (అవును అన్నట్లు తలూపుతాడు.)

యస్.ఐ. – (విజిల్ వూదుతాడు.) మరిద్దరుపోలీసులు ప్రవేశ

స్తారు) వెధవకి సంకెళ్ళెయ్యండి. (మొదటి పోలీసుతో
సేటుమెంటు తీసుకున్నావా? (గౌరి, చంద్రదలు ఆశ్చ
ర్యంగా, విచారంగా వింటూవుంటారు)

పోలీసు - సార్.

యస్.ఐ. — నీ పేరేమిటి ?

సూ - ...సూ...ర్యం

యస్.ఐ. - భయపడకు — మాసర్వశక్తులువిని యోగించినిన్ను బ్రతికిస్తాము. (మూర్తినిచూపిస్తూ) యీ నీచుడుగవర్నమెంటుకు ద్రోహంచేసి,యిరుగు పొరుగువాళ్ళని అన్యాయంచేసి వాళ్ళఆస్తిపాస్తుల్ని అపహరించి ఖూనీలుచేసి, చేయించి, ప్రభుత్వం కంటపడకుండా పారిపోయాడు. వీడికోసం యిడియా అంతా గాలిస్తున్నాము ఇంతకాలానికిచంద్రదంగారిధర్మమా అంటూ యిక్కడ దొరికాడు. అసలు వీడినిజపేరుభద్రయ్య... మూర్తి అనే మారుపేరుతో యిక్కడజీవిస్తున్నాడు. ఈ నేరాన్నిబట్టిద్రోహిని అప్పచెప్పిన చంద్రదంచార్ని ప్రభుత్వం తరుపున ఎంతో అభినందిస్తున్నాము. గౌరి మేనమామ అన్న మమకారంతోను, బసవయ్యా తన బావమర్ది అనే వృద్దేశ్యంతోనూ ఈగుట్టుబయటపెట్ట లేదనుకుంటాను. రక్షించినవాళ్ళని భక్షిస్తాడీ నీచుడు. చంద్రదం ! నీవుచేసిన సహాయం మరువరానిది.

సూ — (బాధపడుతూ) చంద్రదమా!

యస్.ఐ. - అవును. ఇక్కడ జరుగుచున్న సంఘటననిమాకు

చెప్పి మా సహకారం కోరాడు, వెంటనే వారితో రాక జాగుచేసినందుకు చింతిస్తున్నాము అప్పుడేవస్తే నీవీ రివాల్వర్ కి గురికాకుండా వుండేవాడివి. మూర్తి ప్రక్కనున్న పోలీసుతో) ఏయ్! ఈ ద్రోహినితీసుకు పోయి బొమికలు విరగగొట్టి జెల్లో వెయ్యండి వెధవని

2పో — (తాత నాగన్నల్ని పదండయ్యా ముందుకుతోస్తాడు)

నాగ — (పడబోయి ఆగి) ఆలిముండామయ్యా! అయ్యగారు చెప్పింది ఆ దొంగార్ని తీసుకెళ్ళమని...

యస్.ఐ — నోరుముయ్యండి మీఇద్దర్నికూడాఅరెస్టుచేశాం మీరు వెళ్ళాలి. (మూర్తి, తాత, నాగన్నల్ని యిద్దరు పోలీసులు నెట్టుకుంటూ పోతారు.

య .ఐ — వెయిట్ హాండ్రెడ్ అండ్ ఫోర్ (నువ్విక్కడే వుండు నేను వెళ్ళి వేన్ పంపుతాను. [నిష్క్రమిస్తాడు)

1పోలీ — య .ఐ నిష్క్రమించగానే బీడి అంటించి ప్రక్కగా కూర్చుంటాడు

సూ — బాధగా దేకుతూవచ్చి చంద్రం! ఇంకనేను బ్రతకను! చెప్పుడుమాటలు విని మోసపోయాను...నీ ప్రేమని వేరుచేయాలని నీచపురుగులా సంచరించిఅనేకకుట్రలు పన్నాను. పాపిష్టి డబ్బుకాసించి గడ్డితిన్నాను. కానినీ ప్రాణాలు పోపలసింది. ఎన్నితప్పులు చేసినా చివరకు ప్రాణమిత్రుని ప్రాణానికి నా ప్రాణాన్ని అడ్డువేసి నీ కోర్కెనెరవేర్చినందుకు సంతోషిస్తున్నాను. దేకుతూ వెళ్ళి కాళ్ళుపుచ్చుకొని] నే చేసిన అపరాధాన్ని

క్షమించు లేకపోతే నామనస్సుకి శాంతిలేదు. ఇద్దరూ ఏకకంఠంతో ఒక్కసారి క్షమించామినండి... అడేచాలు అనరూ ఇంకా—నే—సం... లే—కోప మేనా చం...ద్రం—

చం - (శూన్యగా చూస్తూ) సూర్యం

సూ - ఆవును యింక బ్రతకను. అనండి వక్కసారి అనండి

చం - గారి అలాగే లే! సూర్యం నెమ్మదిగా గారిచేయి చంద్రం చేయి కలుపుతాడు.

సూ - ఆ—నం ...దం—గా—ప్రా—ణా—లు—వి—ప్రాణాలు విడుస్తాడు. వాయిద్యాలు శివరంజని రాగం హెచ్చుస్థాయిలో వాయిస్తారు)

చం - (పెద్దగా) సూర్యం !
(పోలీసు, చంద్రం, గారి కళ్ళంట నీరు కారుస్తారు)
(సుగుణమ్మ ప్రవేశిస్తుంది)

చం - (పెద్దగ) అమ్మా! (యిద్దరూ నమస్కరిస్తారు)

సుగు - (లేవనెత్తి గారి చంద్రముల చేతులుకల్పినాయునా విచారించకు. మీ పవిత్ర ప్రేమ జయించింది. అడేదుష్ట శిక్షించింది. ఆరోగ్యం చేకూరగానే మీరిద్దరూ వివాహం చేసుకొని ఆదర్శ దంపతులుగా లోకానికి పాఠంచెప్పండి గారి! నిష్కారణంగా నీమీద అపనిం దేసినందుకు క్షమించు (చెరొక ప్రక్కకు తీసుకుంటుంది పోలీసు వెనక్కి తిరిగి ఆశ్చర్యంగా చూస్తూవుంటాడు అతని మెన్నుమీద మంగళం అని వ్రాస్తుంటుంది.

శ్రీ ర స్తు

# హెచ్చరిక

ఈ నాటకానికి సంబంధించిన స్టేజిహక్కు మినహా యావత్తు కాపీరైటు హక్కులు శ్రీరాం శ్రీరాముల విజయవాడ వారికిన్నీ స్టేజిహక్కులు నాకున్నూ చెం యున్నవి. నావ్రాతపూర్వకమైన అనుమతినిముందుగా పొం నిదే యెవ్వరూ ఏవిధంగానూ ప్రదర్శించరాదు. వ్యతిరేకిం ప్రవర్తించిన ఆ నిర్వాహకవర్గం, నటీనటులు,నాచేజరుపబ సివిలు క్రిమినలు చర్యలకు పూర్తి బాధ్యులగుదురు.

సత్యనారాయణపురం
విజయవాడ-2

ఇట్లు